శ్రీ రాఘవేంద్ర గురుధ్యానమః

# సప్రమాణ జోతిస్సారము

## పంచమ తరంగము

### జలవాస్తు - గ్రామవాస్తు - దేవాలయవాస్తు




రచయిత:

ంశపరంపరాసంభవ వైద్య, జ్యోతిషరత్న, వాస్తు స్వయంభువు

శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల

**వేంకట వరదాచార్యులు**

దలదిన్నె పోస్టు. తాడిపత్రి తాలూకా.

పత్రి బ్రాంచి. అనంతపురం జిల్లా.



**1984**

ప్రథమ ముద్రణ: 300 ప్రతులు.

వెల: రు. **7-00**





శ్రీ రంగరామానుజ ప్రెస్, తాడిపత్రి.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# సప్రమాణ జ్యోతిస్సారము

## పంచమ తరంగము

## జలవాస్తు - గ్రామవాస్తు - దేవాలయవాస్తు




రచయిత:

వంశపరంపరానుభవ వైద్య, జ్యోతిషరత్న, వాస్తు స్వయంభువు

శ్రీమాన్ తిరుమలనల్లాన్ చక్రవర్తుల

**వేంకట వరదాచార్యులు**

బొందలదిన్నె పోస్టు. తాడిపత్రి తాలూకా.

తాడిపత్రి బ్రాంచి. అనంతపురం జిల్లా.



**1984**

ప్రథమ ముద్రణ; 500 ప్రతులు.

వెల: రు. **7-00**





శ్రీ రంగరామానుజ ప్రెస్ తాడిపత్రి.

S. Ramchandra Rao

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః



## - విజ్ఞప్తి -

దైవజ్ఞ మహాశయులారా! వరాహమిహిరుడు భావులు త్రవ్వకొనుటకు, పుట్టలున్న, జమ్మిచెట్లులున్న అక్కడ జలముండునని ఇంకా ఎన్నోచెట్లను చూపియుండు జలార్గళ శాస్త్రము చూచితిని. జలరాసులని నిర్జల రాసులని జ్యోతిషులు చెప్పియున్నది చూచితిని. ఇవి మానవులకు ఉపకరించవు. ఎట్లన ఒకనికి జలయోగముండదు. కాని జాతకము గురుపాలితమైయుండ చతుర్థములో శనియుండిన జమ్మిచెట్లుకావలసినన్నియుండును. అక్కడ నీళ్లుండవు. బావి నిలువదు. భూమి నిలువదు. మనుషులు పడి చచ్చి, దయ్యాల బావియని పేరు వచ్చును. ఎట్లు వ్రాసినారని పరికించిన వీరు గురుపాలిత, శని పాలితముల గమనించని వారు గారు. వారు చదివిన ప్రమాణ గ్రంథములందు లేదు. గురు శనిపాలితములు ప్రాథమిక విద్య లగ్న పంచమ, నవమ స్థానములందే స్థానాధిపతులయందే పూర్వ జన్మమున చేసిన పుణ్యమున్నదని తెలిపిన గ్రంథముల గానరు. వారు చూచినది, విన్నది ఇతరులు చెప్పినది గురు శుక్ర శుద్ధ బుధ పూర్ణ చంద్రులు శుభులనియు రవి, కుజ, శని, రాహు కేతువులు నైసర్గిక పాపులనియు చదివినారు. ఆచరణలో నుంచుకొని చెప్పుచున్నారు జాతకముల వ్రాయుచున్నారు. ఒక్కరుకూడ నవగ్రహములలో నైసర్గిక పాపులున్నారా? పాపుల జీవుల రక్షణకు అధికారమెట్లిత్తురు? వీరిని నియమించిన వారెవరు? విష్ణువా? ఈశ్వరుడా? లేక బ్రహ్మయా? మేషాది క్రమేణా తృతీయ, షట్ స్థానాధిపతి బుధుడు

ద్వితీయ సప్తమాధిపతి శుక్రుడు. వీరు ఎట్లు శుభులయిరి? చంద్రునికి క్షీణత్వ వృద్ధత్వములున్నవా? పాపత్వమున్నదా లేదా? లేక నిష్పాపియా పాపియైన సూర్యునికి మేషాది పంచమ స్థాన మెట్లిచ్చిరి? స్థానాధిపత్య దోషముతో పాపులా? లేక శుద్ధపాపులా? శుద్ధ పాపులు ఖగోళములో నుండుటకు స్థానమున్నదా లేదా? పాపపుణ్య మిశ్రితజీవులు నివసించుటకు దేవతా లోకములలో స్థానమున్నదా లేదా? ముప్పదిమూడుకోట్ల దేవతలు పూజనీయుడుగా వందనీయుడుగా భావించిన సూర్యభగవానుడు క్రూరుడా శనిని ఏల్నాటి శని అని చెప్పుచున్నారు. మకర కుంభ వృషభ మిధున కన్య తుల లకు వున్నదా? ద్వాదశాష్టమ జన్మంతు అన్న శ్లోకమునకు అర్థము గ్రహించక పోవుటకు కారణము త్రికోణాధిపతులే జాతకమునకు ప్రాణమని మానవులు చేసిన పుణ్యమందే యున్నదని గ్రహించక పోవుటయే కారణము. ఇది గ్రహించినంతవరకు జోస్యము కనుపూసియే యుండునని తెలియుచున్నది. ఇట్టి విమర్శలు ప్రశ్నలు వేసవేలు పూర్వప్రమాణ గ్రంధములపై పడును. వీటికి సమాధాన మిచ్చినవారు లేరు. ఆలోచించినవారు లేరు. పలకలో పున్నంత బయన్న గోకినంత అన్న సామెతగా అందరు గ్రంథములనే అనుసరించినారు. పృచ్ఛకులడిగిన దానికి సమాధాన మియ్యలేక పోవుచున్నారు. విష్ణు అంశమున గురు కుజ రవి కేతు గ్రహములు (గ్రహరూపీజనార్ధన, శివాంశమున శని బుధ, శుక్ర, రాహు, గ్రహములు ( గ్రహరూపీ మహేశ్వర ) బ్రహ్మ అంశమున చంద్రుడు (గ్రహరూపీవారి జాపన) ఈ త్రిమూర్తులు ప్రపంచ పరిపాలనార్థమై వీరిని సృష్టించిరనియు జంగమ స్థావర వర్గముల పాప పుణ్యానుసరణముగ పాలించు చున్నారనియు మానవులు పాప

పుణ్యమిశ్రితులు గాబట్టి మానవులుచేయు పాపపుణ్యముల గ్రహించి రాబోవు జన్మకు చేసినది ననుభవింప చేయుచున్నారనియు మానవుడు చేయు పాప పుణ్యములకు సంబంధమైనవి ఏ మండలమున చేరవలసినవి అక్కడ వాటంతటవి చేరుచున్నవనియు సర్వము గ్రహించెడి శక్తి నవ గ్రహములకున్నదనియు తెలియుచున్నది. తేలుచున్నది. ప్రతి గ్రహ మునకు స్థానాధిపత్య శుభము. స్థానాధిపత్య పాపము లగ్నముద్వారా గలుగుచున్నదనియు తెలియుచున్నదిగాని పూర్వులు నియమించిన శుభా శుభులవల్ల శాస్త్రమే కనుమూసినదని తెలియుచున్నది. ప్రతి లగ్న మునకు లగ్న పంచమ భాగ్యస్థానాధిపతులే శుభులని గ్రహించిన శాస్త్రము నిలుచును. గురుపాలిత లగ్నములు మీన మేష కటక సింహ, వృశ్చిక ధనుస్సు లనియు శనిపాలిత లగ్నములు మకర కుంభ వృషభ మిధున కన్య తుల లనియు అని తేలుచున్నది వీరు ఒకరిలో ఒకరు కలియ రవి తేలుచున్నది. వీరు హరి హరులై చావు పుట్టుకల గల్పించుచున్నారని తేలుచున్నది. దశానుకూలత దశ అనానుకూలత అని రెండు విధములుగా నున్నది. చెడ్డ దశలు ముందుపోయి మంచి దశలు మిగిలినది దశాను కూలత అనానుకూలత మంచి దశపోయి చెడ్డ దశలు మిగిలినది అనాను కూలత గ్రహానుకూలత చతుర్ధ పంచమ నవమ దశమ ఏకాదశమము లలో లగ్న పంచమ నవమాధిపతులుండుట అని తెలియుచున్నది. దీని నెరిగినగాని జ్యోతిశ్శాస్త్రము కన్నులువిప్పి ప్రపంచములో వన్నె గడింప జాలదు. ప్రకృతమున్న జోస్యులు కొండను త్రవ్వి ఎలుకను పట్టునట్లుగా నానా విధముల నానా త్రోవల పోవుచున్నారు, అసలు గమనించ లేదు, ఈ ప్రాథమిక విద్య గమనించిన దనుక జోస్యమునకు ప్రాణము లేదు,

సూక్ష్మతి సూక్ష్మములకు పోలేకపోయిన ఇది గమనించిన స్థూలముగా నైన పోగలుగుతారు. ఈ విషయములన్నీ సప్రమాణ జ్యోతిశ్శాస్త్రములో ప్రథమ ద్వితీయ తరంగములలో కొంతవరకు తెలియగలరు. జ్యోతిశ్శాస్త్ర రీత్యా జల వాస్తు గ్రామ వాస్తు, దేవాలయ వాస్తు రచించితిని. పూర్వ శాస్త్రముల ఖండించినాడను వారు లేకపోలేరు. వేదాంగ జోస్యము ఆర్యభట్టు వరాహమిహిరాదుల కాలమునకు ముందే నశింపై పౌరాణిక జోస్యమై నానా రీతుల నానా మతముల నానా విధముల సృష్టించినారనియు వంశపరంపరగా జోస్యమున్నవారు ఇతరులకు తెలుపలేదనియు తెలియుచున్నది. నిశ్చయము తెలుసుకొన్నది బయలు పరుపక పోవుటచె వచ్చెడి లాభమేమి. ఈదారి ననుసరించి పరోపకారము చేయువారుందురనియు పూర్వులు తమకు తెలిసిన శాస్త్రమర్మముల తెలుపకపోవుటచేతనే శాస్త్రము కనుమూసినదని నా పరిశోధనలో బయలు పడినవన్ని నిరూపించి వ్రాసితిని. ఈదారిని కాదని నడచిన గమ్యస్థానముగానలేరని వృథాకష్టమై ప్రపంచమున శాస్త్ర హీనమగునని నా నిశ్చితాభిప్రాయము.

ఇట్లు,

గ్రంధకర్త.

శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

# శ్రీ రాఘవేంద్రస్వామి మంత్రాలయము.



శ్లో॥ పూజ్యాయ రాఘవేంద్రాయ సత్యధర్మ వ్రతాయచ
భజతాం కల్పవృక్షాయ నమతామ్ కామధేనవే.



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః

## — శాస్త్ర ముద్రణ పుణ్యార్జన —

నాచే రచింపబడిన సప్రమాణ జ్యోతిస్సారములో పంచమ తరంగము అముద్రితముగానున్న జలవాస్తు, గ్రామవాస్తు, దేవాలయ వాస్తును నా చెంత జ్యోతిశ్శాస్త్రము నభ్యసించుచున్న నా శిష్యుడు మ॥రా॥ రాజశ్రీ లింగరాజు సుబ్రహ్మణ్యం, చి॥సౌ॥కుం॥ శారదమ్మల సుపుత్రుడగు చిరంజీవి **ఫణిశేఖరు** గొప్ప ధనికుడు గాకున్నను సాధారణ కుటుంబీకుడయ్యు లోకోపకారము చేయనెంచి ఈ శాస్త్ర ముద్రణకయ్యే ధనమును స్వయముగా తానే భరించి శాస్త్రమును వెలువడించి ఆచంద్రార్కస్థాయిగ పుణ్యము నార్జించినాడు. ఈ నా విద్యార్థిని శ్రీ శారదాదేవి, సద్గురు రాఘవేంద్రుడు శాస్త్రాభివృద్ధి, వంశాభివృద్ధి నొసంగి సర్వదా కాపాడుదురుగాత.

ఇట్లు,

గ్రంధకర్త.

# పండితాభిప్రాయములు


## జోస్యము జనార్దనశాస్త్రి,
గాజుల క్రిష్టప్ప వీధి, తాడిపత్రి - 515 411.


శ్రీమాన్ వరదాచార్యులవారి సన్నిధికి

అతిగభీర జ్యోతిశ్శాస్త్ర పారావారమును ప్రజ్ఞామంధరముతో మథించి సారభూత నవనీతము లనదగు జాతక - ముహూర్త - వాస్తు ఫలములను లోకమున కందించిన మీ కృషి ప్రశంసనీయము. అసంబద్ధములు - అవిచారితములునని మీకు తోచిన పూర్వ - పూర్వతర శాస్త్రకర్తల యభిప్రాయ సిద్ధాంతములను ఖండించుటకు వెనుకాడని మీ ధైర్యసాహసములకు జోహారులు.

రాశి గ్రహములలో వర్గీకరణము - గ్రహములకు క్రూరత్వ - పాపత్వ - శుభత్వములు స్థానికములేకాని, నైసర్గికముగ లేవనుట - దశానుకూల్యము - లగ్న పంచమభాగ్యాధిపతుల ప్రాముఖ్యము - మీ నూతన పరిశోధనా ఫలితములు. వీని ప్రాతిపదికపై మీ గ్రంధ రచన సాగిన దనుట స్పష్టము.

ప్రాచీన గ్రంధానుసారమైన జ్యోతిషిక లోకము తదనుయాయి ప్రజానీకము మీ నూత్న సిద్ధాంతముల నాకళింపు చేసికొని ఆచరణము నందుంచుటకు కొంత కాల వ్యవధి అవసరమనిపించును. ఆస్తిక్యము - వేద ప్రామాణ్యము - త్రిమూర్తులను త్రిమతములను అనుమతించు మీ మతికి పూర్వ శాస్త్రకారులపైనను తదనుయాయులపైనను అసూయాగ్రహ ప్రవేశమున కాస్కారము లేదు.

చిరంజీవి ఫణిశేఖరుడు నాకడ శిష్యభావముతో గ్రంథములో 'వత్స' పదసంబోధితుండై గ్రహించిన బోధనలు సర్వులకు అందుబాటు కావలెనను సదుద్దేశముతో ముద్రణ వ్యయ ధనమును గురుదక్షిణగా సమర్పించుకొని ధన్యుడైనాడు. గ్రంథ-గ్రంథకర్తల ఆశయములు అఖిల జనామోద మందుకో గలిగిన నాడే సార్థక్యము నధిగమించును. ఆది సమీప భవిష్యత్తున సంపన్నము కాగలదని ఆశింతును.

చిత్తగింపుడు.

తాడిపత్రి
3-2-84.

విద్వాన్ జోస్యము జనార్దనశాస్త్రి.



డాక్టర్ సి. వి. సుబ్బన్న, శతావధాని, ఎమ్.ఎ., పి హెచ్.డి.,
ప్రొద్దుటూరు - 516 360.

శ్రీమాన్ తిరుమల నల్లాన్ చక్రవర్తుల వేంకట వరదాచార్యులవారు జ్యోతిషరత్న ప్రసిద్ధులు. వీరికి వీరే సాటి.

మన దేశమున జ్యోతిష్కులకు కఱవు లేదు. బజారులో లెక్క లేనన్ని జ్యోతిష గ్రంథములు దొరకును. ఉత్సాహవంతులు కొని పరిశీలించు వారెందరో కలరు. నేనును ఆ పని చేసినవాడనే. ఎంత శ్రమించినను ఫలము లేకపోయినది. దోష మెక్కడున్నదో గోచరించినది కాదు. విసుగెత్తి పుస్తకాల కట్ట మూలనబెట్టితిని. ఒక నాడు మా యింటికి వచ్చి నా మిత్రులు బ్రహ్మశ్రీ కాశీభట్ల వెంకట సుబ్బయ్యగారు నాకు ఆచార్యులవారి అడ్రసిచ్చిరి.

ఆచార్యులవారు ఉదారస్వభావులు. ఆదరించి, 'త్రోవ అదిగాదు నాయనా! యిది' యని ఆశ్చర్యకరముగా వివరించిరి. వారి పద్ధతి సూక్ష్మములో మోక్షము అన్నట్లుండును. అప్పటినుండి నాలో జ్యోతిర్విద్య పట్ల ఆసక్తి మిక్కుటమయ్యెను.

ఆచార్యులవారు ద్రష్ట. వారికి గురువు లేడు. వారి మార్గము నాకు గురుపీఠము. నా వలెనే దేశీయ పండితులు తమ త్రోవ దిద్దికొనగలరని భావించుచున్నాను.

ఈ జలవాస్తు గ్రంథము చాల విలువ గలది. భావులు త్రవ్వ కొనువారు దీనివలన లాభపడుదురు. నీళ్ళు లేనిచోట త్రవ్వి త్రవ్వి యెందరో లక్షలు నష్టపడుచున్నారు. ఈ గ్రంథము మొత్తము దేశము మీద ఏడాదికి ఒక కోటి రూపాయలు వృథా వ్యయము కాకుండ పొదుపు

చేయించగలరు. ఇటువంటి గ్రంథము మున్నూరు ప్రతులే ముద్రింపింప బడినది. ఇవి దేశమున ఏమూలలకు చాలును ? ముప్పదివేల గ్రంథము లైనను చాలవు.

ఆచార్యులవారు ఈ గ్రంథమును ఆంగ్ల భాషలో అనువదింపజేసి ప్రకటించినచో ప్రపంచ ప్రజలందరికి ' జలవాస్తు ' వివేకము కలుగును ఆవశ్య కర్తవ్యమైన ఈ కార్యము నుపేక్షించినచో గ్రంధ చౌర్యమునకు అలవాటు పడిన పెద్దలు ఈ సిద్ధాంతము స్వోపజ్ఞకమని ప్రకటించు కొందురు కదా!

శ్రీ వరదాచార్య ప్రణీతమైన సప్రమాన జ్యోతిస్సారము సర్వ లోకమునకు లోచనము వంటిది. వీరి జ్యోతిర్విద్యా పరిశోధన కేంద్ర మునకు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వములు సంపూర్ణ సహకారము కల్పించి విశ్వశ్రేయమునకు దోహదము చేయగలవని విశ్వసించుచున్నాను.

సుధీవిధేయుడు,
సి. వి. సుబ్బన్న, శతావధాని.
2.2.1984

శ్రీ రాఘవేంద్ర గురుభ్యో నమః

శ్రీ శారదా దేవతాభ్యోనమః  శ్రీ లక్ష్మీ నృసింహాయనమః

# సప్రమాణ జ్యోతి స్సారము

శ్లో॥ శివం హరిం విధాతారం తత్పత్నీస్తత్సుతాన్ గురూన్
సత్వా సమస్త ప్రత్యూహశాంతయే మంగళాయచ.

## పంచమ - తరంగము

## జలవాస్తు.

---

శ్రీ:- స్వామి! పూర్వులు జలవాస్తును చెప్పడములో జమ్మి చెట్లు పుట్టలుగల స్థలములో నీళ్లుండుననియు, ఇంకా కొన్ని చెట్లను చెప్పినారు. తామేమందురు.

గు:- శ్రీవత్సా! వారు తలంచిన మార్గము - మానవుల కుప యుక్తమగు మార్గముగాదు. చూడు. జమ్మి చెట్టు శనికి ప్రీతి; శని ఈశ్వరాంశ ఈశ్వరుడు ఈశ్వరుని నెత్తిపై గంగ గలదు మరియు శని పశ్చిమ దిశాధిపతి. అష్టదిక్పాలకులలో పశ్చిమమునకు వరుణుడధిపతి. వరుణుడు వర్షమునకు, నీటికి అధిపతియని జమ్మి చెట్లున్నచోట నీరు గలదని వారి భావము. కొంత అనుభవము. పుట్టలన్ననో పుట్టలకు అధిపతి సర్పములనియు, సర్పము ఈశ్వరునికి భూషణములనియు సర్పములు కుమారస్వామికి వాహనములనియు భావించినారేగాని జ్యోతి శ్శాస్త్రము గాదు. శాస్త్ర దూష్యము. లగ్న చతుర్థమును శని శుభుడై చూచినను అశుభుడై చూచినను అచ్చోట తప్పక జమ్మి చెట్లు మొలుచును. భూత గణముండును. శ్మశానము సమీపములో నుండును. శనికారకత్వములన్నియు నుండును. పుట్టలన్ననో రాహువులగ్న చతుర్థ

దశమములలో రాహు వున్నయెడల పుట్టలుండును. చెదులుండును. సర్పములు క్రిమి కీటకాదు లుండును. వాటి నివాసయోగ్యముగాన అచ్చో టుండును. గాని నీళ్లుండవు. చతుర్థమున చంద్రుడుండిగాని చంద్రుడు శుభుడుగాని యుండినచోట బావి త్రవ్వ నీళ్లున్నవని తెలుసుకొని జమ్మి చెట్లు, పుట్టలున్నచోట్లలో నీళ్లుండు నన్నారు. శనిపాలితలగ్న చతుర్థ ముల శని చూచిన వుండినా రాహువు చూచిన వుండిన జమ్మి చెట్లు పుట్టలుండును. అవి చంద్ర శుభస్వర లగ్నములైన, నీళ్లుండును. గురు పాలితలగ్నములకు చతుర్థమున శని చూచినా వుండిన రాహువు చూచిన వుండిన జమ్మిచెట్లు పుట్టలుండును. అక్కడ బావి త్రవ్విన నీళ్లుండవు, బావి నిలువదు. మనుషులుపడి చచ్చి దయ్యాల బావి యగును. - శని లగ్నముల-గురువు చూచినను, వుండినను ఆ బావిలో నీళ్లుండవు, గడ్డ లుండవు. పూర్వులు శనిలగ్నములలో శనిపాలితములలో బావులు త్రవ్వి నీళ్లుండుట చూచి సర్వులకు నీళ్లుండునని చెప్పినారుగాని, అది శాస్త్రము గాదు. వత్సా!

కం॥ స్థావర జంగమములకున్
కావలెగా మంచి నీరు కాపాడుటకున్
దేవతలకు సస్యములకు
భూవలయంబునకు నీరు ముఖ్యము వత్సా.

వత్సా! జలములేక సస్యములు మొలువవు. సకల జీవులు బ్రతుకవు. వర్షములేక భూమి సస్యశ్యామలముగాదు. నీరుప్రాణులకు సకల ఓషధులకు ముఖ్యము. తులాలగ్నమై వుండును.

శ్రీ:- స్వామి కొందరు ఎవ్వరిని అడుగకనె బావులు త్రవ్వి నను జలము కొల్లగా నుండునే. దీని నేమందురు?

గు:- వత్సా! చంద్రుడున్నచోట జలముండు తప్పక.
చంద్ర బలము గలుగు జాతకునకు
కొండమీదనైన నుండును దండిగా
పూర్వ పుణ్యమునను పుట్టు జలము

వత్సా! జలమునకధిపతి చంద్రుడని చెప్పితినిగదా! చంద్రుడా జాతకమునకు శుభుడై పాపగ్రహవీక్షణ లేకుండి లగ్నమునకు ఎన్నింట నుండునో అన్ని మట్లలోతు జలముండును.(మట్టు అనగా ఆరుఅడుగులు) ఎవరినిఅడుగక త్రవ్విన వారికి చంద్రుడు శుభుడై చతుర్దశమములలో శుభగ్రహము లుండును. అట్టి జాతకములు కొండలపైన త్రవ్వినా సంపూర్ణ జలముండును. అట్టివారినిచూచి, 'పులినిచూచి నక్క వాతలు పెట్టుకొన్నట్లు' కొందరు త్రవ్వి నష్టపడు వారున్నారు. బావులవల్ల నష్టపడువారున్నారు, లాభపడువారున్నారు. ఎందుకనగా పూర్వజన్మమున ధర్మ సలింద్రలు పెట్టించి ధర్మానికి బావులు త్రవ్వించి రుద్రాభిషేకములు నేయించినవారికి నీరు మంచిగ కావలసినన్ని ఇరుకారులకు జలముండును. లాభముండును.

శ్రీ:- స్వామి: చంద్రుడు ద్వాదశ రాసులకు శుభుడనియు, చంద్రునికి శత్రువు లేదనియు చంద్రబలం చంద్రబలమని అంటూ వుంటారు. చంద్రలగ్నాత్ జాతకముల చూచెదరు. చంద్రుడున్న లగ్నమును రాశి అనెదరు నిశ్చయమే ననెదరా!

గు;- వత్సా! అన్ని గ్రహములకు శత్రు, మిత్రత్వము లున్నట్లు లగ్నము ద్వారా చంద్రునికికూడా వున్నారు. స్థానాధిపత్యదోషము ప్రతి గ్రహమునకు వున్నది చూడు మకరమునకు సప్తమాధిపతి, కుంభమునకు షట్స్థానాధిపతి, వృషభమునకు తృతీయాధిపతి, మిధునమునకు

ద్వితీయాధిపతి, సింహమునకు ద్వాదశాధిపతి, కన్యకు ఏకాదశాధిపతి, ధనస్సుకు అష్టమాధిపతి గాన ఈ ఏడు రాసులకు చంద్రుడు పాపియై బాధించును. త్రిషడష్టాయరిప్పేశా విపరీత ఫలప్రదాః అన్నారు. వీరికి 3, 6, 8, 12 మాత్రమే అగుపడినవి. 2, 7, 11 అగుపడ లేదు. ఇవి కూడా పాపస్థానములే యగుసు.

శ్రీ:- స్వామి! ఏఏ లగ్నములకు చంద్రుడు శుభుడో తెలిపెదరా?

గు:- వత్సా! మీన, మేష, కటక, తుల, వృశ్చిక జాతకులకు చంద్రుడు శుభుడు గాన స్థలము మంచిదిగానే వుండును. చంద్రుడు యెన్నింట నుండునో చంద్ర బలాబలము ననుసరించి నీరుండును. అంతకులోపల శుభగ్రహముండినా చూచినా జలము పడుసు.

శ్రీ:- స్వామి! లగ్నమునకు ఏ స్థానము బావి త్రవ్వుటకు, కోనేరు త్రవ్వుటకు, గృహము కట్టుటకు వుండవలయునందురు.

గు:- వత్సా! చతుర్థము బ్రహ్మస్థానమందురు. చతుర్థమున లగ్న పంచమ నవమ స్థానాధిపతులుండిరేని బావులు, కోనేర్లు భూమి సంపాదించు యోగముండును. చతుర్థమును ఎన్ని గ్రహములు చూచునో వుండునో అన్నిభావులు వనములు గృహములు మొదలగునవి దండిగా నుండును. పాపగ్రహమున్న, చూచిన చింతింప చేయుటో, కట్టినవి చెడిపోయి దుఃఖింప చేయుటో తప్పదు. చతుర్థమున నొక శుభగ్రహమున్న వానికే కొదువ గలుగదు. పాపగ్రహములున్న చేసినవి పాడు చేయును. లేదా విక్రయము చేయించును. చతుర్థము మానవులకు ముఖ్యమగు స్థానములలో ప్రథమ స్థానము సర్వసుఖముల చేకూర్చును.

ఆ॥ నాలుగింట శుభులుగలవారికుండును
సర్వసంపదాళి సముదయంబు
నాల్గు చెడిన చెడును నానావిధంబుల
నాల్గు గలుగు వాడు వెలుగు వత్సా.

నాలుగింట శుభులుగలుగువాడు నానావిధ సౌఖ్యములు పొందును స్థిరాస్థుల సంపాదించును, పాపులున్న సర్వము చెరచును. బావులలో నీళ్లు తక్కువ చేయును. గడ్డల పడగొట్టును. నీటి రుచి చెరచును.

కం॥ పాపులు నాల్గింటుండిన
శ్రీపతి తోడైన వాని స్థిరములు చిత్తా
దాపురమగు కష్టంబులు
కాపుర మే చెడును కడకు కనుగొన వత్సా.

చతుర్థమున పాపగ్రహములు గలిగిన దశమమును చూచును. బ్రహ్మ స్థానమేగాక విష్ణు స్థానము చెరచును. సకల వస్తుసముదాయముల సృష్టించునది బ్రహ్మ స్థానము. వృత్తి, ఉద్యోగ, వ్యాపార గౌరవ ప్రతిష్టాదుల గల్పించునది దశమముగాన జీవనరక్షణోపాదుల చెరచును బావులు, చెరువులు, కుంటలు ఇందులోనే గలవుగాన బావులు నిలువ జాలవు. చెరువులు, కుంటలు తెగిపోవును. ధనమున్నవారు కట్టుదురు, నిలుచుకొనలేవు. ఒక చెట్టు వేసినను కొట్టివేయు కాలము తనకన్ను లెదుటే వచ్చును.

శ్రీ:- స్వామి! ఒకరి నడుగకనే కొందరు బావులు త్రవ్వు చున్నారు. దండి జలము గలుగుచున్నవి. కారణ మేమందురు.

గ:- వత్సా! దీనిని జన్మ ఫలమందురు.

ఆ॥ మీన కటక తులల మేష వృశ్చికముల
పుట్టినట్టివారి భూములందు
కోరుకున్నచోట్ల కొల్లగా జలముండు
పూర్వ పుణ్యఫలము పోదు వత్సా.

కం॥ కొండలపై గుట్టలపై
బండలపై నైన చంద్రబలముండినచో
దండిగ జలముండు ననుట
పండును బంగారు పంట వసుధను వత్సా.

మీన, మేష, కటక, తుల వృశ్చికముల పుట్టి చతుర్థమున నొక శుభగ్రహమున్నవారికి ఏ చోటనైనా జలముండును. నీటివల్ల లాభముండును. వీరు కొండలలోనైనా, బండలపైననైన త్రవ్విన బావులలో సంపూర్ణముగ జలముండును. భూమి బంగారుపంట పండును. వనములు దండిగా కాసి సంపూర్ణ లాభమిచ్చును.

గు:- వత్సా! భూమి సృష్ట్యాదిలో ఒకే సదరముగా ముక్కోణాకారముగ పుట్టినదని తెలియుచున్నది. అయితే నవగ్రహముల వీక్షణములవల్ల పరిపరివిధములుగా మారినది- భూమి కధిపతి కుజుడు. కుజునివల్ల కొండలు, గుహలు, కనమలు గుండ్లు, పేట్లు, అకాడమీలు, వనములు, కోటలు, బురుజులు, గుంతలు, మిట్టలు, వంకలు, వాగులు, గొప్ప వృక్షములు ఇట్టివి అనేకము కలిగినవి. కుజుడు చతుర్థమున నున్నను చూచిన ఆ భూమి ముక్కోణమని పరిమాణముగాన ఆ భూమిపై కుజవీక్షణపడి ముక్కోణమయియున్నది. చాకిరీ మాన్యములుగా నుండును.

సూర్యునివల్ల మాన్యములు, పట్టణములు, బంజరు భూములు, శివాయిజమలు, రస్తాలు, రాజగృహములు, జిల్లేళ్ళు మొలుచుభూములు వలయాకారముగానున్న భూములు మోటు తిరుగుస్థలములు, ఇటుకలు కాల్చు స్థలములు, కాలిన స్థలములుగా నుండును. సూర్యమండలము వలయాకారము గాన సూర్యుడు చతుర్థమందున్నను చూచినను వల యాకారముగా స్థళముండును. అచట ధర్మసంస్థాపనలు చేయుదురు. ఆ స్థలము మాన్యమై యుండును.

చంద్రునివల్ల జలము, నదీనదములు, సముద్రములు, చెరువులు ఇసుక తెరభూములు, ఇసుక, కాల్వలు, కుంటలు, ఊటెత్తుభూములు, ఊటకాల్వలు, బావులు, కోనేర్లు, కొలనులు, విలాస మందిరములు, మహడీలు, పుష్కరిణులు, పూనతోటలు, ఇసుక యడారులు, మళ్ళు, చాకిరీ మాన్యములు, పల్లపు స్థలములుగా నుండును. చంద్రుడు చతుర్థ మందున్న సమచతుష్కోణముగ ఆస్థలముండును. పల్లముగా నుండును.

బుధునివల్ల బూడిదరంగు భూములు ఓషధులు మొలచు భూములు రుద్రభూములు భూత ప్రేత పిశాచ-శాకినీ ఢాకినులుగల గృహములు దిబ్బలు మూత్ర పురీషస్థలములు మాంత్రికుల గృహములు వ్యాపార స్థానములు మాంస విక్రయశాలలు వుండును. బాణాకారముగ స్థలముండును.

గురువు:- దేవతా మాన్యములు బ్రాహ్మణ మాన్యములు, విష్ణు దేవాలయములు, వేద పాఠశాలలు, వసతిగల భూములు, వసతిగల గృహములు బ్రాహ్మణ అగ్రహారములు శ్రోత్రియములు సృష్టించును. దీర్ఘచతుష్కోణముగా స్థలముండును.

శుక్రుడు:- పాటశాలలు-పశువుల దొడ్లు, పశువులు మేయు బీళ్లు పాకశాలలు, నాట్యమందిరములు, అమ్మవారి దేవాలయములు, జాతర చేయు స్థలములు వేశ్యా గృహములు, సంగీత సాహిత్య కళాశాలలు, విశ్వవిద్యాలయములు, భజన మందిరములు, కల్యాణ మంటపములు, కల్లు సారాయి అంగళ్ళు, తాటి, ఈతచెట్ల స్థలములు, మాంస విక్రయ శాలలు పంచకోణముగా స్థలముండును

శని:- దిబ్బలు, స్మశానములు, వధ్యస్థానములు, ఈశ్వర దేవాలయములు, బలిపెట్టు స్థానములు, పనికిరాని భూములు చర్మము లమ్ము అంగళ్ళు, మెట్లు అమ్ము అంగళ్ళు జమ్మిచెట్లు, విపరీతముగ మొలుచు భూములు, విధవలకు హక్కుగలుగు భూములు, గృహములు శివునికి శివసత్తులకు మాన్యములుగల భూములు, దింపుడు కల్లము, ముండమోయు స్థలములు, సన్యాసులుండు సత్రములు, ఆశ్రమములు, ధనురాకారముగా భూములు నుండును.

రాహువు:- పుట్టలు, చెడులు, గరిక గలిగి, క్రిమికీటకాదులు గలిగి చోరులుండు స్థలములు, పనికిరాని బీడులుగలిగి శూర్పాకారముగా నుండు భూములు గలిగి రెండు మోట్లు గుండ్రముగా నుండును.

కేతువు:- గోరీలు, గోషాయిలుండు చోట్లు, దర్బలుండు స్థలములు, మడుగులు, పీర్ల మాన్యములు ధ్వజాకారముగ నుండు భూములుండును.

ఈవిధముగా భూమి మార్పు జనించినది. నవగ్రహములు ఏఏ దిశవారు ఆయా దిశల పోషించుచున్నారు. వారి వారి కారతత్వములందు ప్రకాసింపచేయుచున్నారు. తూర్పునకు సూర్యుడు ఆగ్నేయమునకు

శుక్రుడు దక్షిణమునకు కుజుడు, నైఋతికి రాహువు, పశ్చిమమునకు శని వాయువ్యమునకు చంద్రుడు, ఉత్తరమునకు బుధుడు, ఈశాన్యమునకు గురువు, ఇట్లు ఈ దిశల పాలించుచున్నారు. వీరి కిరణములు ఎక్కడెక్కడ ఎక్కువగా పడునో ఆ గ్రహముయొక్క నడక వారి బుద్ధి అక్కడ పనిచేయుచుండును ఒక్కొక్క ప్రదేశమున ఒక్కొక్క రీతిగా ఆచార వ్యవహారములు రూపము దేహము బుద్ధి మారుచుండుట గ్రహ బలము వల్లనే మార్పు జరుగుచున్నదని తేలుచున్నది. ఒక్క సర్వే నంబరులో ఏ గ్రహమున్నదో, చూచుచున్నదో ఆయా దిశల శుభుడైన శుభము, అశుభుడైన అశుభము గలిగించుచునే వున్నారు. ఉదాహరణ ఆ సర్వే నంబరులో శుక్రుడు వుండడముగాని చూడడముగాని వుండిన అగ్నిమూలలో పశుగ్రాసమగు. గరిక నుత్పత్తిచేయుచున్నాడు. ఆ భూమి ఆడవారిదిగా చేయును. కొంతకాలము పశువుల బీడుగా నుండును. గాన ఏ గ్రహముండునో చూచునో ఆకారకత్వములందు ఉత్పత్తి చేయుచున్నాడు. ఇది నిశ్చయము.

శ్రీ:- స్వామి! భూమి పలువిధములగు రంగులతోనున్నదే కారణమేమందురు?

గు:- వత్సా! సూర్యుడు చూచినను, వుండిన శ్వేత పసుపు రంగులో భూమి వుండును, గురువు ఉండినను, చూచినను పసుపు రంగులో తెలుపు ఎక్కువగా నుండును. కుజుడు చూచిన, వుండినా ఎరుపు రంగులో నుండును. చంద్రుడు చూచిన ఇసుక రంగులో ఇసుక తువ్వగా నుండును. శుక్రుడు, బుధుడు చూచినను, వుండినను ఎక్కువ తెలుపు కలిసిన నలుపుగా నుండును. శని చూచినా ఉండినా సంపూర్ణ నలుపుగ నుండును. శని కుజులు కలిసిన నలుపులో ఎరుపు మిశ్రమ

ష్యగా నుండును. గురు శనులు కలిసిన తెలుపు నలుపు మిశ్రమముగా నుండును. భూమి గ్రహములవల్లనే రంగులు మారినదని నిరూపణ జరుగుచున్నది. నాలుగైదు గ్రహములు చూచిన ఏఏ గ్రహ దిశన ఆయా రంగు వుండును. గురువు పాపియై చూచిన సవటభూమిగా మార్చును కుజుడు పాపియై చూచిన కనిక రాళ్ళతో, బెలుకు రాళ్ళతో పండని భూమిగా నుండును.

శని పాపిగా చూచిన నిస్సత్తువమైనట్లు చేయును. శుక్రుడు పాపియై చూచిన గడ్డితో గరికతో పశువుల బీడుగా చేయును. బుధుడు పాపియై చూచిన ఉండినా, ఓషధుల చెట్లతో పాడు భూమిగా బూడిద వన్నెతో పంటరాక పాడగును. రవి పాపిగా చూచిన అగ్నిరంగుగల భూమిగా మార్చి త్రోవలుపెట్టి అచ్చిరాక పండకుండ చేయును. చంద్రుడు పాపిగా చూచిన ఇసుకతెరనేలగాయై ఏదీ పండకుండ చేయును. పొలపపోవుచుండును.

శ్రీ:- స్వామి! ఒక సర్వే నంబరులో నలుగురైదుగురు భాగస్వాములుగా నుందురే తెలుసుకొనుటెట్లు?

గు:- వత్సా! చతుర్థ స్థానమును ఎన్ని గ్రహములు చూచునో ఉందురో, అందరు భాగస్వాములుందురు. అందులో పాపగ్రహ భాగములు శుభగ్రహ భాగముల వారికి విక్రయింతురు. నలుగురు భాగస్తులుండిన ఒకప్పటికి ఇరువురే అగుదురు. స్థానాధిపతి ఒక్కడుండినా ఒక భాగస్తుడుగా నుండును. అతనితో ఎందరు చేరివుందురో అందరు ముందు వుండి వుందురు. ప్రకృతము ఎందరు చూతురో అందరు ఆ సర్వే నంబరులో నుందురు.

శ్రీ:- స్వామి! ఈ భూమిలో ఎచ్చట ఏ దిశన బావి త్రవ్విన బాగుండునని అడుగుదురే దాని నెట్లు గమనింపవలెను-చెప్పవలయును.

గు:- వత్సా ఏ దిశ గ్రహము శుభుడుగా నున్నాడో ఆదిశన త్రవ్వట శ్రేయము. పూర్వులు దిశాధిపతులకూడ మార్చినారు. దీనిని నమ్మకూడదు. ఈ చక్రమును పరికించుము.

| | | |
|---|---|---|
| నైరుతి రాహువు | పరమట శని | వాయువ్యం చంద్రుడు |
| దక్షిణాం కుజుడు | | ఉత్తరం బుధుడు |
| ఆగ్నేయం శుక్రుడు | తూరుపు రవి | ఈశాన్యం గురువు కేతువు |

జాతకమునకుగాని, తత్కాల ప్రశ్న లగ్నమునకుగాని ఏ దిశాధిపతులు శుభులుగా నుందురో ఆ దిశన త్రవ్వట శ్రేయము. దిశాధిపతి, దిశాధిపతి రెండు గృహములు శుభముగా నుండిన మిగుల శ్రేయముగా నుండును. ఎట్లన శని సింహములో నుండిన మూడింట తులను పదింట వృషభమునుచూచును. శుక్రుని ఇండ్లు రెండు శుభస్కరమగును. శుక్రుడు పాపులతో చేరక పాపుల చూపులలో నుండకపోయిన మిగుల శుభముగా నుండును. ఇది శని పాలిత లగ్నమైన శుభస్కరము గురుపాలితలగ్నమైన అశుభస్కరము. గురుపాలిత లగ్నములకు కుజుని వల్లను శనిపాలిత లగ్నములకు శని రెండు లగ్నముల చూచు బలము గలదు. (ఉదాహరణ) మేషమందు కుజుడుండిన వృశ్చికమునుచూచును

అన్ని గృహముల కుజుడు చూచునుగాని, శని తన రెండు యిండ్లను ఒక్కసారి ఏ స్థానమునుండి చూడ లేడు. కటక సింహముల ఒక్కసారి చూడలేడు. అట్లు చూచెనేని సర్వము నాశనము చేయగలుగును. కుజుడు కటకము నుండి శని రెండిండ్లను చూచును. మకరము నుండి కటక సింహముల చూచునుగాని లయకారకుడుగాడు ప్రపంచోద్ధారకుడు.

వత్సా! గ్రహము గ్రహస్థానములు రెండు శుభస్థితిలో నున్న దిశను చూపవలయును. లేదా గ్రహమైన శుభస్థితి జెందివుండవలయును. ఆ స్థానము నుండియే ఊటలు వచ్చుచుండును. గురుపాలిత లగ్నము లకు గురు, కుజ, రవి, చంద్ర, కేతు, గ్రహ దిశలనుండి నీరు వచ్చును వీరిలో ఎవ్వరు బలముగా చూతురో ఆ దిశ నుండి ఊట ఎక్కువగా వచ్చును. శనిపాలిత లగ్నములకు శని, శుక్ర, బుధ, రాహు, గ్రహ దిశల నుండి ఊటలు వచ్చును. పాపగ్రహ దిశలనుండికూడా వచ్చుట గలదు. శుభగ్రహములు పాపగ్రహ స్థానములందుండిన పాపగ్రహ స్థానములందుండి నీరువచ్చును.

శ్రీ:- స్వామి! భూమికి ఇరువాగుల వంకలుండునే యే గ్రహమువల్ల నందురు.

గు:- ఆ॥ అయిదు మూడులోన అంగారకుండున్న
వంకలుండు భూమి ప్రక్కలోన
పాపియైన వంక ప్రబలంబుగా నుండు
మంచియౌచుచూడ మంచి వత్సా!

గు:- వత్సా! కుజుడు లగ్నమునకు మూడో యిల్లును చూచి నను అయిదవ యిల్లును చూచినను చూచిన ప్రక్కన వంక తప్ప

కుండును. లేదా తగ్గు భూమిగా నుండును. గుట్టగా నుండును. అశు భుడుగా చూచిన గొప్పగా నుండును. శుభుడుగా చూచిన కొంచెముగా నుండును. శుభుడుగా చూచిన కొంచెముగా భూమివారికి మేలు చేయు నదిగా నుండును. చెట్లు మొలుచును. ఆ దిశనుండి బావికి ఊటలుండును చెట్లవల్ల లాభముండును.

తే॥ కుజుడు శుభుడయి చూచిన కూరుచున్న
కనిక రాళ్లుండు చెట్లుండు గనులు గలుగు
వంక లుండును నొకప్రక్క వరిగియుండు
కంది మేల్పంట పండును కనగ వత్సా!

కుజుడు శుభుడయి చతుర్థమును చూచినను, వుండినను కనిక రాళ్లు, చెట్లు వంకలుండును. భూమి ఎరుపు రంగు గలదిగా నుండును. పంట బలముగా పండును. కంది అపారముగా పండును. చెట్లకు యోగ్య మైన భూమిగా నుండును. పాపియైన పంట రాదు. అయోగ్యమైన భూమి యగును.

శ్రీ:- స్వామి! బావులు త్రవ్విన కొన్ని బావులకు గడ్డలు యిరిగి పడుచుండునే కారణ మేమందురు?

గు:- వత్సా! చతుర్థదశమముల బలముగా పాపగ్రహము లుండిన ఏ దిశాధిపతి వుండునో ఆ దిశన పడుచుండును. ఆ దిశనుండి వచ్చు ఊటలో చెడు నుండును మిశ్రమ గ్రహము లుండిన ఒక ఊట మంచిది ఒక ఊట చెడ్డది వచ్చును. బావి అన్యుల పాలగును. భూమియు నిలువదు.

శ్రీ:- స్వామి! కొందరు బావులు త్రవ్వి నీళ్లు పడక విడచి పెట్టుచున్నారే కారణ మేమందురు?

గు:- వత్సా! కటకము చంద్రుడు అశుభమై చతుర్థదశమముల బలముగా పాపగ్రహములుండిన బావిలో నీళ్లుండవు. దావి నిలువదు. ఆ భూమి నిలువదు. ఎన్నిగ్రహములు చతుర్థమును చూచునో అన్ని గుంతలు త్రవ్వి పూర్తి నీరు గానక బండలు పడి గడ్డలు నిలువక పెద్ద పెద్ద గుండ్లు పడి జేడె పడి ఒకటి విడచి వకటి త్రవ్వి ధన వ్యయము చేసుకొని దుఃఖింతురు. చతుర్థమున పాపగ్రహ ముండిన చేసిన పని అంతా చెడిపోయి కడకు దుఃఖములో మునుచును. వారి కార్యములన్నీ నాశనములే యగును. చతుర్థము సృష్టిస్థానము తాను సంపాదించిన వస్తువులు పరుల పాలగును. దీనిని బ్రహ్మస్థాన మందురు. దశమము జీవన క్షేత్రము. వృత్తి ఉద్యోగ వ్యాపార గౌరవ ప్రతిష్ఠల నిచ్చు స్థానము. దీనిని విష్ణుస్థాన మందురు. ఈ స్థానములో లగ్న పంచమ భాగ్య స్థానాధిపతు లుండి వారి దశలు పోకుండిన వారు ధన్యాత్ములు, వారు ఏది చేసినను కార్యము సఫలమగును.

శ్రీ:- స్వామి! కొందరికి ఉప్పు నీళ్లు, చేదు నీళ్లు పడును. కొందరికి నీళ్లకు సమన్వయముగా కాక భూమి ఉప్పుల్లుచుండునే కారణ మేమందురు?

గు:- వత్సా! పాపులై చతుర్థ దశమములో చతుర్థ భావము లోపల రవి కుజ గురు చంద్ర కేతువు లుండిన ఉప్పునీళ్ళు పరమ జవుకు నీళ్ళు పడును. భూమికి సమన్వయముగావు శని, శుక్ర, బుధ, రాహు గ్రహము లుండిన చేదు నీళ్ళు, బంక నీళ్ళు భూమికి, చెట్లకు సరిపోని నీళ్ళు పడును. ఇట్లుండినను చంద్రుడు చంద్ర క్షేత్రము శుభులు చూచి

నను వుండినను భూమికి సరిపోవు నీళ్ళుండును. తక్కువగా నుండును. రుచి లేకుండును. చతుర్థ భావమునకు గ్రహము ముందుకు నడచి వుండిన అనగా 5, 6, 7, 8, 9, 10, 11, 12 భాగలలో నుండిన 6, 7, 8, 12 భాగలు విపత్తుల గలిగించును. 5, 9, 11 ధన వ్యయము, 10 భాగలో నుండిన బావిని భూమినికూడా నిలువనియ్యదు. విక్రయింప చేయును. పైరు పూర్తి రానియ్యదు. యాభై భాగలకు లోపలగానే ఫలము నిచ్చును. చతుర్థమున లగ్న పంచమ భాగ్యాధిపతు లుండి చంద్ర కటకములు శుభస్థితిలో నుండిన పూర్తి పంట నిచ్చును. జీవి తాంత ముండును. వంశ పరంపరగా నిలుచును.

శ్రీ:- స్వామి! కొందరి బావులలో మనుష్యులుపడి చచ్చు చుందురే దీనినేమందురు

గు:- వత్సా! లగ్న చతుర్థము బావియని చెప్పితినిగద; ఆ చతుర్థము తుల, వృషభము, మకర, కుంభ, కటకములగు స్త్రీ గృహ ములలో శని బలీయుడై యుండిన అనగా చతుర్థ, అష్టమ, దశమ, ద్వాదశ భావము లందుండిన ఆ బావిలో స్త్రీలుపడి చచ్చిపోవుదురు. ఆ భూమిలో జమ్మిచెట్లు మొలుచు చుండును. ఆ స్థానము భూత ములకు నెలవు గాన బావిగడ్డపై ఊత వచ్చిన పురుషులు లేక స్త్రీలు వంటరిగ దిగిన తప్పక బావిలో పడుట నిశ్చయము. ఆ భూతములు అట్టి విపత్తుల గల్పించును. ఆ శనిని లగ్న పంచమ నవమాధిపతులలో నొకరు చూచిన పడిన సమయమునకు ఎవరో వకరు వచ్చి గడ్డన వేయుదురు. అదే శని శుభుడై చతుర్థము నందుండిన పడబోరు. పడిన లేచివత్తురు. -గురువు శుజుడు, రవి, 'పాపియై చతుర్థము నందున్న పురుషులు పడుదురు. చంద్రుడుండిన బాలురు గర్భవతులు పడుధురు. దీనిని స్థల మహాత్మ్య మందురు:

శ్రీ:- స్వామి! చతుర్థభావమన్నారే దానిని తెలుసుకొనుట యెట్లు?

గు:- వత్సా! సూర్యుడు ఒక నెల ఒక రాశిలో నుండునుగదా ఆ ముప్పయి దినముల పండ్రెండు భావములతో భాగింపు చేసిన రెండు న్నర దినము వచ్చును. సూర్యుడా రాశిలో చేరి ఎన్నినాళ్లో గమనించి రెండున్నరదినముతో భాగించిన ఏ భాగలో నున్నది తెలుసుకొననగు ప గదా ఇట్లే ప్రతి గ్రహము రాశిలో చేరిన దినముల లెక్కించి వారివారి దినములతో సరిచూచిన తెలియనగును. వక్రగతులకూడా గమనింప వలయును. ఆ రాశి విడచి వెనుక రాశిలో ప్రవేశించినట్లయిన వెనుక రాశి భావమును చూడవలయును. తిరిగి తానున్న రాశిలో ప్రవేసించిన దినము నుండి లెక్కింపవలయును. సూర్యుడు చంద్రుడు క్రమబద్ధ ముగా పోవుచుందురు. సూర్యుడు నెల దినము లుండును. చందుృడు రెండున్నర దినము ఒక రాశిలో నుండును. గురువు ఒక్క సంవత్సర ముండును. శని రెండున్నర సంవత్సరముండును. గురువు ఒక్కొక్క భావమునకు ఒక నెల వుండును - శని రెండున్నర నెల ఒక్కొక భావ ములో నుండును - శుక్ర బుధులు ఒక్కొక నెల వుందురు. కు జు డు నెలన్నర ఒక రాశిలో నుండును. రాహు కేతువులు ఒకటిన్నర సంవ త్సర ముందురు. అందరిని పై విధముగానే చూచుకొనవలయును.- ఈ విధముగాచూచి భావ చక్రము వేసుకొనవలయును. 1, 2, 3, 4 భావ ములలో గ్రహముండిన స్థాపిత నిర్మాణములకు బలము గ్రహమున్న భావము బలముగా నుండును. శుభాశుభగ్రహముల నిట్లేచూడవలయును

శ్రీ:- స్వామి! బావికి నలు దిశల ఏ ఏ వృక్షములుండిన శుభము. ఆదాయముండు నందురు. ఫల వృక్షములు మేలా ఆదాయ

మిచ్చు వృక్షములు మేలా తెలుపుడు.

గు:- వత్సా!

ఆ॥ బావి చుట్టుపట్ల ఫలపుష్ప వృక్షముల్
లేక లాభమిచ్చు టేకు మద్ది
భాగి నార వేప శ్రీగంధపున్ చెట్లు
పనస విప్పలుండవలయు వత్సా

ఫలవృక్షములు సంవత్సరమున కొకసారి ఆదాయ మిచ్చును. మామిడి, టెంకాయ, పనస, ఉసిరిక, సన్న నిమ్మ, అల్లనేరేడు, వెలగ సంవత్సర మున కొకసారి ఆదాయ మిచ్చును. లేదా ఏనాడో ఆదాయ మిచ్చునవి టేకు, శ్రీగంధము, నార వేపి, మద్ది, విప్ప, బిరసనప, ముష్టి, తాటి. ఈ చెట్లు ఏనాడో ఆదాయ మిచ్చును, జమ్మి. వేప, మేడి, రాగి, తెల్ల జిల్లేడు సంౘ్రడ మారేడు, మోదుగ, బ్రహ్మమేడి, ఉండరాదు. ఉండిన దైవ సమానముగ చూడవలయును. భూత నివాసములగు మఱ్ఱి, జువ్వి తాంౘ్రడ, చింత, వుండరాదు. పుష్పము లిచ్చునవి రామబాణము, గన్నేరు పారిజాతము, పొన్న, దేవగన్నేరు మొదలగునవి వుండవచ్చును.

శ్రీ:- స్వామి! బావి క్రింద కొందరికి మంచి పంట వచ్చును. కొందరికి అర్ధ పంట వచ్చును కారణ మేమందురు?

గు:- వత్సా! చతుర్థ దశమములలో నుండు శుభగ్రహ బల మునుబట్టి బావి, భూమి, భూమిలో పంట వచ్చును. యజమాని బాగు పడును. చతుర్థ దశమములలో పాపగ్రహములున్న జాతకునకు పంట అర్ధమే వచ్చును. తెగుళ్లు వచ్చి మానవుని చింతింప చేయును. సుఖపడ లేడు. ఇది పూర్వజన్మ పాపఫలము. పాపగ్రహము బలముగానుండిన ఆ భూమిని బావిని విక్రయించును. బావికి చంద్రుడు, భూమికి కుజుడు

కారకులుగాన వీరు బలముగా నుండిన కొంత కాలముండును. కొంత మేలు కలుగును. ఈ రెండు గ్రహములం పాపత్వముచెంది చతుర్థమున నొక శుభగ్రహ ముండిన కొంత నయముగా నుండును.

శ్రీ:- స్వామి! కొందరికి వనము మంచి ఆదాయమిచ్చును. కొందరికి అర్ధ పంటే వచ్చును. మరికొందరికి నాలుగింట ఒక భాగము పంటకూడ రాక దుఃఖపెట్టును. కారణ మేమందురు?

గు:- వత్సా! కుజుడు కుజక్షేత్రములు బలముగా నున్నయెడల వృక్ష సంపద బలముగా నుండును, ఫలము దండిగావచ్చును. యజమాని సంతోషించును. కుజుడు కుజ క్షేత్రములు పాపత్వము చెందినయెడల చెట్లు వృద్ధిగా నుండవు. యజమాని సంతోషింప లేడు.

చంద్రుడు చంద్ర క్షేత్రము శుభస్థితిగా నుండిన పూత దండిగా పూయును. పూసిన పూత రాలిపోక నిలుచును. దండిగా పండును. పూతకు చంద్రుడు పిందెకు కుజుడు కారకులు. పంట చక్కగా వచ్చుటకు చతుర్థమునగల శుభగ్రహ బలముగాన చక్కగా యోచించ వలయును.

శ్రీ:- స్వామి! ఒక శుభగ్రహము చతుర్థమును చూచుటలో తానున్న యింటి బలమిచ్చునా, చూడబడిన యింటి బలమిచ్చునా లేక తా నేదిశాధిపతియో ఆ దిశ బలమిచ్చునో తెలుపుడు.

గు:- వత్సా! గ్రహము తానున్న యింటిలో ఎంత బలముగా నుండునో అంత బలము చూచెడి యింటిలో నుండును. ఇక్కడ యే భావములో నుండునో అక్కడ అదే భావములో నుండును. తానున్న యింటి కారకత్వముల చూచెడి యింటి కారకత్వముల నిచ్చును. తా

నేదిశాధిపతియో ఆ దిశ బలమియ్య జాలదు. ఉదా॥అవగో తానున్నది లగ్న చతుర్థమున అది బుధుని యిల్లు. చూచెడిది గురుని యిల్లు. బుధుని కారకత్వముల, గురుని కారకత్వముల ఫలమిచ్చును. చతుర్థము బ్రహ్మస్థానము. దశమము విష్ణుస్థానము గాన తాను చేసెడి కార్యములు ఫలించి కీర్తి గౌరవములు చేకూరును. సుఖించును.

శ్రీ:- స్వామి! ఒక్కొకరికి ఎన్నో బావులుండును; ఒక్కరికి ఒక బావి కూడా వుండదు కారణ మేమందురు?

గు:- వత్సా! జాతకములోగాని ప్రశ్నలోగాని చంద్రుని ఎన్ని గ్రహములు చూచునో అన్ని బావులుండును. కటకము, చంద్రుడు శుభుడై యుండిన బావులు తనకు నిలుచును మంచినీరుగా నుండును. కటకము, చంద్రుడు పాపిష్ఠియైయుండి శుభగ్రహ వీక్షణ గలిగిన బావులుండును. ఎన్ని గ్రహములు చంద్రుని కటకమును చూచునో అన్ని బావులుండి మంచినీరుగాక పడిపోయి పాడగును. నీటికి కారకుడు చంద్రుడు గాన చంద్ర క్షేత్రబలము చంద్రబలము గలవాడు సుఖపడును. క్షేత్రము చంద్రుడు పాపత్వము చెందినవాడు చింతింపక తప్పదు.

శ్రీ:- స్వామి! ఒకరికి పూత ఎక్కువగ వనములో రాలును ఒకరికి రాలదు. ఒకరికి పిందె రాలును. ఒకరికి రాలదు. కారణ మేమందురు?

గు:- వత్సా! సస్యాధిపతి చంద్రుడు. చంద్రబలమున్న వానికి పూసిన పూతంతయు రాలక నిలుచును. చంద్రుడు పాపియైనచో పూత నిలువదు. కుజుడు శుభుడుగా నుండిన పిందె నిలుచును. నిలిచిన పిందె రాలక కాయలుగామారి లాభమిచ్చును. పిందెకు కాయకు చెట్టుకు

కొమ్మకు కుజుడు అధిపతి గాన కుజుని బలము వనమునకు ఆవశ్యకము కుజుడు పాపియైనచో పిందె రాలును. కాయ పెద్దది గాదు. చెట్టు వృద్ధి చెందదు, కొమ్మలు దండిగా పెరుగవు. మరింత పాపియైనచో వేసి పెంచిన చెట్లను తనతోనే కొట్టివేయింపచేసి పాపఫలమిచ్చును.

గు;- వత్సా! దేవతా వృక్షముగాగాని ఫల వృక్షముగాగాని పదుగురు కూర్చొను స్థలముగా చూచి వేసి పోషించి వసతిగా అరుగు కట్టిన పది మంది కూర్చొని లోకాభిరామాయణము చెప్పుకొనుచుందురు. పక్షులు తలదాచుకొనును, ఆ నీడ ఎందరికో ఉపకరించును. ఆ పుణ్యమువల్ల మరుజన్మలో వనరూపముగా లక్షల సంపాదింపచేయును. సర్వసౌఖ్యము లనుభవింపచేయును. వేసిన చెట్లను నాశనము చేసినవానికి చెట్లవల్ల పాపము సంభవించి చెట్టు చామలేని జీవియగును. కాళ్లులేని వాడగును.

శ్రీ:- స్వామి! ఒకరికి దండిగా గృహములుండును. కొందరికి యుండవు. పనికిమాలిన భూమి కొందరికుండును. మంచి భూమి కొందరి కుండును. కారణ మేమందురు?

గు:- వత్సా! గృహములకు కారకుడు గురువు. గురువు శుభుడై ధనుర్మీనముల శుభత్వము చెందినను అట్టి గురువే చతుర్థ దశమములలో నుండినను కావలసినన్ని గృహములు సర్వ వసతులతో నుండును. వాడు ముందు జన్మమున సత్రములు, సావిళ్లు కట్టించిన పుణ్యుడు. మరియు భజన మందిరములు, శిథిల దేవాలయములు కట్టించి పుణ్యము ప్రోగుచేసుకొన్న ఘనునికి గృహములు కొదువుండవు.

కుజుడు కుజగృహాములు శుభస్థితిజెంది చతుర్థమున నొక శుభ గ్రహమున్నవారికి కావలసినంత భూమి మంచిదిగాను పోవుటకు వచ్చు

టకు అందుకున్నట్లుగా లభించును. దీనికి విరుద్ధముగానుండిన భూమియే లభించదు. లభించిన ఎందుకు పనికిరానిదిగ కష్టించినను ఫలము లేనిదిగ నుండును. దుఃఖింప చేయును.

శ్రీ:- స్వామి! కొందరికి వనము దండిగా పూసి రాలిపోవు చుండును, కొందరికి పిందె రాలును. దీనికి కారణ మేమందురు?

గు:- వత్సా! చంద్రుడు సస్యాధిపతి గాన పూతకు అధిపతి, చంద్రుడు కటకము శుభస్థితి జెందియుండినను కుజుడు, కుజ క్షేత్రములు శుభస్థితి జెందియుండినను పూత పిందె రాలదు. చాలా లాభదాయకముగా పంట పండును. పాపులైనచో చంద్రునివల్ల పూత కుజునివల్ల పిందె నశింపయి అనుకున్నంత పంట రాక చింతింప చేయును.

శ్రీ:- స్వామి! బావి త్రవ్వు స్థలములో బండ పడునా లేక బెలుకు, నల్లబండ, గుండ్లు, జేడె, ఇసుక, వఱ్ఱు, గట్టిమట్టి, సట్టు, సుద్ద ఎన్నో మట్టులో ఎట్టివి పడునో తెలుపమందురు. ఏ గ్రహమువల్ల ఏవి పడునో తెలుపుడు.

గు:- వత్సా! గురువు శుభుడై చూచిన సాధారణముగా ఆటంకమే గలుగదు. ఒకవేల ముతక తెలుపురాయి పడును. అది సులభముగా వచ్చును. పాపియై చూచిన బండ పడును. కష్టపెట్టును- శని శుభుడై చూచిన చిన్న చిన్న నల్లగుండ్లుగాని, నల్లటి బండగాని, జేడెగాని, నల్లసట్టుగాని పడును. అది సులభోపాయముగా పోవును. పాపియై చూచిన మానవుని కష్ట నష్టములపాలు చేయును. కుజుడు శుభుడై చూచిన ఎఱ్ఱటి బండ పడును. బెలుకులో గట్టిదిగా పడును. ఎఱ్ఱ సుద్ద పడును. గట్టిమట్టిగా పడును. ఎఱ్ఱసట్టు పడును. భద్రముగా

బావి నిలుచును. పాపియై చూచిన కష్ట నష్టములపాలు చేయును. బావి నిలుచుట కష్టము. రవి శుభుడై చూచిన శేత పసుపు రంగుగల రాయి గలిగి సులభోపాయముగ వూడి వచ్చును. ఎక్కువఖర్చు పెట్టదు. గడ్డలు పడవు. గవిగా పడవచ్చును. శాశ్వతముగ బావి నిలుచును. పాపియైనచో కాల్పులతో త్రవ్వకొనవలసి వచ్చును. నష్ట కష్టము లెన్నో పెట్టును. కడకు బావి నిలుచుట కష్టము. చంద్రుడు శుభుడై చూచిన తెల్లటి రాయిగాని తెల్లటి బెలుకుగాని గట్టి తెల్ల సుద్దగాని తెల్లసట్టుగాని పడి సంపూర్ణ జలముండును. సర్వ విధముల సుఖపెట్టును. పాపియై చూచిన గడ్డలు నిలువనివి ఇసుక పడును. తెల్లసుద్ద పడును. వఱ్ఱు వచ్చును. నీళ్లు చాలక పోవును. కడకు బావి విడువవలసి వచ్చును.

బుధ శుక్రులు శుభులై చూచిన, వుండిన సాంబ్రాణి కట్టురాయి పడును. బంతపడునుగాని సులభోపాయముగ త్రవ్వకొన నగును. సాంబ్రాణి కట్టు సట్టుపడి బావి నిలుచును. పాపులై చూచిన గడ్డలు నిలువక అమితమైనఖర్చుతో పాడుచేసి నష్టకష్టములకు లోనుచేయుదురు

రాహు కేతువులు చూచిన, వుండినా శుభుడై వున్న గ్రహము చతుర్థములో వుండిన శుభాశుభములతో కాకిరెక్కరాయి పడును. మిశ్రమముగా మట్టిరాయి పడును. పాపి చతుర్థములో నుండిన నష్ట కష్టముల పాత్రుని చేయును. రాహుదశ పోయిన కేతువు, కేతుదశ పోయిన రాహువు సంపూర్ణ బలవంతులు, రాహువు శని పాలితుడు కేతువు, గురుపాలితుడు గాన చక్కగా యోచించవలయును. చతుర్థము బావి గాన చతుర్థమును ఏ గ్రహము చూచునో అట్టి శుభాశుభముల గల్పించు చుండును. లగ్న ద్వితీయ తృతీయ చతుర్థముల శుభాశుభులు చూతురో అచ్చట పాపి కష్టమును శుభుడు సుఖమును గల్పింతురు. ఉదా= లగ్నమును పాపి చూచిన పై మట్టులోనే కష్టపెట్టును. ద్వితీయము రెండవ మట్టు శుభుడు చూచిన చక్కగా కష్టపెట్టక త్రవ్వకొన

గలుగును. ఇట్లే అన్ని స్థానముల గమనింపవలయును. శుభులున్న చోట్లు చూచిన చోట్లు శుభముగానుండును. పాపులు చూచిన స్థానములు కష్ట నష్టములకు దారి తీయును. ద్వాదశ రాశుల ఇట్లే చూడవలయును.

శ్రీ:- స్వామి! ఒకరికి మంచి భూమి నలు చదరముగా దండిగా నుండునే ఏ గ్రిహమువల్ల నందురు?

గు:- వత్సా!

తే॥ కుజుడు నాలుగింట శుభురుగా కూర్చున్న
మేలుభూమి నిచ్చుమేర మీరి
కుజుడు పాపియౌచు కూర్చున్న చూచిన
భూమి సున్నయౌను భువిని వత్సా!

కుజ గ్రిహము శుభుడై చతుర్థమున నుండిన భూమి మంచిదిగా నలు చదరముగలిగి మంచి పంట పండునదిగా వనమువేయు భూమిగా లభింప చేయును. అదే గ్రిహమునకు అదిపత్య దోషము గలదైన భూమి వుండినా కొన్నను నిలువనీయడు. పండని భూమిగా నుండును. చెట్లు చామలు వృద్ధి చెందనిగా చేయును. భూమి చదరముగా నుండదు భూమికి కారకుడు కుజుడు నాలుగింట నుండిన శుభుడైన మంచిదిగా, అశుభుడైన చెడ్డదిగా నుండును. నాలుగు భూస్థానము భూమికి కారకుడు కుజుడుగాన శుభుడైన సత్ఫలమిచ్చును. అశుభుడైన విపరీత ఫల మిచ్చును.

శ్రీ:- స్వామి! బావిలో బుగ్గలు పడినవందురు. ఎగరజిమ్ము చుండును. నీళ్ళు పారుచుండును గాని ఊర్ధ్వగతియై క్రిందికి మిందికి పారగలవా? దీని విషయము తెలుపుడు.

గు:- వత్సా! పారుచుండెడి నీళ్లకు అడ్డముగా బండలు, కొండలుగా నిల్చి నీళ్లను పోనివ్వకపోవుటవల్ల సందులలో నుండి ఎగరజిమ్మును. దీనిని బుగ్గలందురు. నీళ్ల పైకి పారవు. పైనుండి నీళ్లి ఎంత బలముగా వచ్చునో అంత బలముగా ఎగరజిమ్ముచుండును. దీనిని బుగ్గలని ప్రజలనుచుందురు.

శ్రీ:- స్వామి! కుజుడు భూమికి కారకుడు. చంద్రుడు నీటికి కారకుడన్నారు. ఇరువురు చతుర్థమున కలసియుండిన ఎట్లుండు నందురు.

గు:- వత్సా!

తే॥ కుజుడు, చంద్రుడు నాల్గింట కూడియున్న
తలచినట్టుల లభియించు జలము భూమి
పండు బంగారు పంటలా బావి క్రింద
పుణ్యపురుషుల కిట్లుండు భువిని వత్సా!

దేవాలయములకు భూమిని మాన్యము నిచ్చి చెట్లు వేసి పెంచి అరుగునుగట్టి బావుల ధర్మమునకు త్రవ్వించి, సలింద్రలు పెట్టించి పశువులు త్రాగను కుంటలు కట్టించి సత్రముల కట్టించి అక్కడ నీటి వసతిని గల్పించినట్టి పుణ్యులకు యిట్లుండును. తాను తలచినట్లు భూమి నీళ్లు లభించి లాభము గడింపచేయును. కుజ, చంద్రుల కలయికను చంద్ర మంగళయోగమందురు. ఈ కలయిక మీన, మేష, కటక, వృశ్చికములకే చెల్లును. సింహ, ధనుస్సులకుముందు చంద్రుడు వెనుక కుజుండుండిన చెల్లును. తులకు కుజుడు ముందు చంద్రుడు వెనుక నుండిన చెల్లును. మిగతా మకర, కుంభ, వృషభ, మిధున, కన్య లకు కుజ చంద్రులు కలిసి ఏ భావములో నుండిన ఆ భావము నాశనము చేయుదురు.

దీనిని అన్ని రాశులకు మంచిదని చెప్పి జోస్యము నశింపు చేసినారు.

శ్రీ:- స్వామి! సుకృత దుష్కృతములవల్లనే సుఖ దుఃఖములు గలుగుచుండు నందురా.

గు:- ఆ॥ జన్మ సుకృతమున్న జలముండు ఫలముండు
లేనివాని కేది లేదు జగతి
సుకృత ఫలము నరుని సుఖపెట్టు నిలబెట్టు
దుష్కృతంబు దుమ్ము దులిపికొట్టు

వత్సా! ముందుచేసిన సుకృతమువల్ల భూమి, నీరు మంచిదిగా చేజిక్కి ఏ పొలము పెట్టినా చీడ-చిక్కు గలుగక చక్కని పంట పండి సుఖ పెట్టును. దుష్కృతమువల్ల చిక్కులనేకము గలుగును, చేసినపని చెడిపోవును. దుఃఖపెట్టును.

శ్రీ:- స్వామి! బావికిగాను పృచ్ఛకుడు అడిగినతోడనే ముఖ్యముగ దేనిని చూడవలయు నందురు.

గు:- ఆ॥ పూర్తి నీళ్లుగలుగు భూమియౌనో కాదో
తరచి చూడవలయు తగిన రీతి
నీళ్లు లేనిచోట నీ వెంత చూపిన
కలుగబోవు నీళ్ల గనుము వత్సా!

ముందు చూడతగినది ఆ స్థలములో నీళ్ల దండిగా నున్నవా లేదా అన్న విషయము అటుపై దర్లు నిలుచునా లేదా ఏ దిక్కున త్రవ్విన మేలుగా నుండును ఏ దిక్కు నుండి గడ్డలుల్లిపడును. ఫలము పూర్తి ఫలమా, అర్ధ ఫలమా, నీళ్ల భూమికి సమన్వయ మగునా కాదా అన్న విషయముల గమనించి చెప్పవలయును.

శ్రీ:- స్వామి! ఇది మాన్యమని, యిది బ్రాహ్మణమాన్యము ఇనామని, దేవుని మాన్యమని, విధవల భూమి అని గంగమ్మ ఈశ్వర మాన్యమని మఠముల మాన్యమని చెప్పుదురే గమనించు టెట్లు?

గు:- వత్సా!

కం॥ గురుడుండిన చూచిన యది
నరయగ బ్రాహ్మణుల మాన్యమైయుండు ధరన్
సరసిజగర్భుండిట్లు భూ
సురులకు సృజియించిపంచె చూడుము వత్సా.

గురువు నాలుగవ స్థానమున వుండిన, చూచిన బ్రాహ్మణ భటవర్తి యినాముగాని, మాన్యముగాని, దేవతా మాన్యముగా నుండునని శాస్త్రము చెప్పును. అది విక్రయమై పట్టా అయినను తిరిగి ఏనాటికో మాన్యమై పోవునని తెలియుచున్నది.

కం॥ ఇన శశి కుజులుండిన నట
కనశాకిరి మాన్యమౌను కలకాలంబున్
వనజజుడిటు సృజియించెను
ఘనులెవ్వరు కాదటనరు కనుగొను వత్సా

ఈ మూడు గ్రహములలో చతుర్థమందు ఎవ్వరుండినను మాన్యములుగా నుండును. సూర్యుడుండిన రెడ్డి మాన్యము, ప్రభుత్వ మాన్యముగా నుండును. కుజుడుండిన కుమ్మర, కమ్మర, మంగల మాన్యములుగా నుండును. చంద్రుడుండిన చాకల, వేశ్య, మాన్యములుగా నుండును. రాహు వుండిన మాదిగ, ఆసాద మాన్యములుగా నుండును.

వత్సా! కం॥ కనగ చతుర్థ భావమున
శని యుండిన విధవ భూమి స్థలమును గృహమున్
వనజాసను నిర్ణయమని
జనులకు తెనుపంగవలయు జగతిని వత్సా!

శని చతుర్థ మందుండిన విధవల హక్కుగా నుండును. లేదా ఈశ్వరుని మాన్యముగా నుండును. మతముల మాన్యమై యుండును. గంగమ్మ మాన్యముగానో నుండును.

కం॥ నరయగ నాల్గింటను శని
స్థిరముగ కూర్చున్న హక్కు స్త్రీలకు నుండున్
గరికటు మెండుగ నుండును
శరివరదుని సాక్షి యిద్ది గనుమా వత్సా

చతుర్థమున దశమమున శుక్రుడుండిన స్త్రీల హక్కుగా ఆ భూమి వుండును. వేశ్యామాన్యముగ నుండును. ఆగ్నేయ మూల గరిక మొలుచు చుండును. చతుర్థము సంపూర్ణముగ నాక్రమించి యుండిన భూమి అంతటా గరికమయముగా నుండును. ఒకప్పుడు బీడుగా పశు వులు మేయుచుండు స్థలముగా నుండును.

కం॥ బుధుడటు నాల్గింటుండిన
అది మామదో తాత హక్కోనైయుండుగనన్
నిది విధి లిఖియించినదని
మదిలో నూహించి చెప్పు మహిలో వత్సా!

వత్సా! చతుర్థమున బుధగ్రహ .ముండిన మాతుల న్యాయముగల వారిదిగా నుండును. శుభుడైనచో చాలా కాలము నిలుచును. పాపియైన విక్రయమై పోవును.

కం॥ కేతువు నాల్గింటుండిన
ప్రేతములను బూడ్చు స్థలమొ, పీర్లదిగానో
ప్రీతిగ నాశ్రమమునకున్
ధాతలు యిచ్చినదిగానో తలుపుము వత్సా.

కేతువు నాలుగింట నుండిన ఆ భూమి పీర్ల మాన్యముగానో, ఆశ్రమ మాన్యముగానో, గోరీల మాన్యముగానో. గోరీల స్థలముగానో నుండును

చతుర్థమున రాహు గ్రహముండిన మాదిగ మాన్యము, ఆసాది మాన్యము, జంతు బలిచేయు స్థలము, బలిపిల్లలు నరుకు స్థలము దింపుడు కల్లముగానో నుండును.

శ్రీ:- స్వామి! జలరాసులని, నిర్జలరాసులని రాసులలో విభజించినారే ఇది నిశ్చయమే నందుర.

గు:- వత్సా! వారు చెప్పినవి పురాణోక్తములు. శాస్త్రోక్తములు గావు. చంద్రుడు శుభుడుగా నుండు రాసులే జలరాసులు. అవి మీన, మేష, కటక, తుల, వృశ్చిక రాసులకు శుభుడు చంద్రుడుగాన జలరాసు లనవలయును. తక్కిన రాసులకు అశుభుడు చంద్రుడు గాన నిర్జలరాసు లనవలయును. ఈ పురాణోక్తముల చూచి సైంటిష్టులు విమర్శకులు విపరీత జ్ఞానముగలవారు, మూఢ నమ్మకములని అంటూ వుంటారు. చంద్రుడు లేక నీళ్లులేవు. కుజుడు లేక మంచి భూమిలేదు. చతుర్థము దశమము బలిష్ఠముగా నుండిన భూమి జలము పంట చక్కగా నుండును.

శ్రీ:- స్వామి! చంద్రుని కటకమును ఏ శుభగ్రహము చూడక చతుర్థ దశమములలో లగ్న పంచమ భాగ్య స్థానాధిపతులలో నొకరుండిన నీళ్లుండునా వుండవా తెలుపుడు.

గు:- వత్సా! శుభగ్రహము చతుర్థమును చూచిన అచ్చట నీరుండునుగాని దండిగా నీరుండక సంతృప్తి నివ్వజాలదు. వర్షాకాలము కొంతవరకు నీరుండును. వేసవి కాలములో ఊటలు తగ్గిపోవును. అప్పటిలో ఎచ్చటెచ్చట శుభగ్రహములున్నవో అక్కడికి బోరింగుగాని రిగ్గుగాని పోయిన జలము మరింత ఎక్కువగును. బావి తప్పక నాలుగు మట్లుండవలయును. మట్టు అనగా ఆరు అడుగులు. (ఉదాహరణ) పదో యింటిలో శుభగ్రహ మున్నదను కొనుము. పది అర్లు అరవై అడుగులగును అందులో భావి కొలత తీసివేయవలయును. అనగా నాలుగు మట్లు భావి ఉన్నదిగద నాలుగార్లు యిరవైనాలుగు. అడుగులు అరవై అడుగులలో తీసివేయగా ముప్పైఆరు అడుగులు మాత్రమే బోరింగు వేయవలయును. ఎక్కువ తక్కువ లుండరాదు. చంద్ర కటకములు శుభస్థితి జెందక చతుర్థ దశమములలో నవమ స్థానాధిపతి యుండిన బావి నిలుచును. నీరు ఒక కారుకుండును. లగ్న పంచమాధి పతులుండిన కొంచము తక్కువగా నుండును.

శ్రీ:- స్వామి! ఏ రాసులవారికి జలమువల్ల లాభముండును. ఊటలు కావలసినన్ని వుండును తెలుపుడు.

గు;- వత్సా! జలరాసులగు మీన, మేష, కటక, తుల, వృశ్చిక ములకు చంద్రుడు కటకము లగ్న పంచమ భాగ్యస్థానములగును గాన నీటివల్ల లాభముండును. తక్కిన లగ్నములకు 2, 3, 6, 7, 8, 11, 12 స్థానముల వాడగుటవల్ల పాప ఫలమే యిచ్చును. ఊటలు బలముగా రావు. మంచి నీరుండదు.

శ్రీ:- స్వామి! ఊటలు ఏ ఏ దిశల నుండి వచ్చును. అని అడిగిన తెలుపుటెట్లు?

గు:- పత్సా! ఏ దిశాధిపతి లగ్నమో తెలుసుకొని ఏ దిశాధి పతులు చతుర్థమును చూతురో ఆ దిశల నుండి ఊటవచ్చును. ఎన్నవ మట్టును శుభగ్రహము చూచునో ఆ మట్టులో ఊట వచ్చును. అంత వరకు నీరు ఎక్కివచ్చును. ఏ దిశాధిపతి పాపగ్రహమై చూచునో ఆ దిశ నుండి నీరు మంచిది రాదు (ఉదాహరణ)

| | | | |
|---|---|---|---|
| | | రా | |
| | | | |
| | | | కు శు |
| ల | గు కే | శ | ర చ బు |

మూడవ మట్టును కుజ శుక్రులు చూచుచున్నారు. అగ్నిమూల నుండి చేదు నీరు, దక్షిణము నుండి మంచి నీరు వచ్చును. అంతవరకు వర్షాకాలము నీళ్లు ఎక్కివచ్చును నాల్గవ మట్టును గురు, రవి, బుధ, చంద్రులు, కుజుడు చూచుచున్నారు. పాప గ్రహములు రెండు శుభగ్రహములు మూడు అయినవి కుజుడు, అందరికి వెనుక నుండి చతుర్థమును చూచు చున్నాడు. గాన చతుర్థము కొంతవరకు శుభస్కరమయినది. నీరు మంచివిగా లేకున్నను భూమికి సరిపోవునట్లుండును. అయిదవ మట్టును శని చూచు చున్నాడు. నీరును రానివ్వడు. ఆ మట్టులో చాలా కష్టపెట్టును. ఆరవ మట్టులో రాహూ వున్నాడు. నీరును గురు, కేతువులు చూపించినను, రాహూవు చెడ్డగా మార్చివేయును. ఏడులో ఎవరు లేరు. ఎవరు చూడలేదు. ఎనిమిది కటకము. దనుస్సుకు పాపగృహము గురువు ముందు శని వెనుక చూచు చున్నారు గాన ఫలము దుష్ఫలము రెండు కలియుటచేత సుఖములేదు. తొమ్మి దింటిలో శుక్రుడు వెనుకై కుజుడు ముందై యుండుటవల్ల

ఇక్కడ సుఖము లేదు. పదియవ యింటిలో రవికి బుధుడు వెనుకై చంద్రుడు రవి ఒకే పాదములో హస్తా నక్షత్రమున నుండుటవల్ల శుభా శుభములు మిశితముగా నున్నవి. పదకొండవ యింట శని వున్నాడు సంపూర్ణ అశుభము పండ్రెండింట గురుకేతువులున్నారు. ఆఇంటిని కుజుడు చూచు చున్నాడు గాన ఇక్కడ నీరు వున్నంతలో మేలుగా నుండును. బోరింగు వేయదలచిన ఇక్కడికి వేయవలయును. లగ్నము నుండి ద్వాదశ స్థానము గాన ద్వైభై రెండు అడుగులగును. నాలుగుమట్లు బావి వున్నది ఇరవైనాలుగు అడుగులు ద్వైభైరెండులో తీసివేసి 48 అడుగులే వేయవలయును. చాలకపోయిన తిరిగి చతుర్థము వరకు పోవలయును. అక్కడికి 96 అడుగు లగును. ఇంక పోవుటకు వీలుపడదు.

ఇట్లే జాతకమునుగాని ప్రశ్న లగ్నమునుగాని చూడవలయును. ధనుస్సుకు కటకము చంద్రుడు పాపులుగాని చతుర్థమును లగ్న పంచమ భాగ్య స్థానాధిపతులు చూచుచున్నారు అందువల్ల బావి త్రవ్వినంతవరకు విడువదు. కొంచము భూమిమాత్రమే పారును. దండి భూమికి చాలవు ఇట్లు గమనింపవలయును.

శ్రీ:- స్వామి! జలరాసులుగాని రాసులకు మకర, కుంభ, వృషభ, మిధున, కన్య, ధనుసు లకు నీరు లభించుట కష్టమే నందురా.

గు:- ఔను ఈ రాసుల లగ్న పంచమ బాగ్య స్థానాధిపతులు చతుర్థ దశమములలో నుండుటయు, చంద్రుని చూచుటయు, చంద్రుని కూడివుండుటయు, కటకమున పదిలముగా నుండుటయు గలిగియున్న మరియు దశానుకూలత గలిగియుండినచో జలయోగము గలుగును. దీనికి తోడు కుజుడు కుజ క్షేత్రములు శుభులతో కట్టుబడియున్నను చంద్రుడు చంద్ర క్షేత్రము శుభులతో చూడబడుటయు గలిగిన మరింత మేలుగా నుండును. దీర్ఘాలోచనచేసి చెప్పవలయును.

శ్రీ:- స్వామి! కొందరు భావి త్రవ్వక రిగ్గు వేసుకొని కావలసినంత భూమికి పారునట్లు చేసుకొను చున్నారు. కొందరు నదీ తీరములోనే బావి త్రవ్వుకొని పనికి రాక నీళ్లు చాలక వట్టి, జేడె బండ వచ్చి బావిని విడచిపెట్టుచున్నారు. కారణ మేమందురు?

గు:- వత్సా! చతుర్థమున నొక శుభగ్రహముండి చంద్రుడు కటకము శుభస్థితిలో నుండిన బావి త్రవ్వక రిగ్గువేసుకొనినను కావలసినన్ని నీరుండును. చతుర్థమునకు పాపగ్రహవీక్షణ గలిగినయడల అర్ధ జలముండి నీరు స్వచ్ఛంద గుణములో నుండవు. అదిగాక చంద్రుని పాపగ్రహము చూచినను నీటిలో గుణము మారును. చతుర్థమున బలిష్ఠముగ పాపగ్రహముండిన ఎక్కడ త్రవ్వినను బావి చెడిపోవుటో పరుల పాలగుటో తప్పదు. చతుర్థము చెడినవానికి అన్ని విపత్తులే తటస్థించును.

కం॥ చుక్కలరేని బలంబున
చొక్కంబగు నీరముండు చోద్యంబందన్
తక్కువ బలముండినచో
తక్కువగానుండు జలము తథ్యము వత్సా!

కం॥ ఎన్నింటనున్న చందురు
డన్నింటను జలము గలుగు నరయగ నుర్విన్
తన్నేపాపియు కనుగొన
కున్నను జలముండు నచట కోరినయట్టుల్.

వత్సా! కొన్ని కుండలుల వేసి చూపెదను చక్కగా పరిశీలించుము.

| | | | |
|---|---|---|---|
| చ కు | | ం | రా |
| ర శు | 16-2-83 | | |
| బు | 12-40 | | |
| కే | గు | శ | |

ఈ లగ్నమునకు తృతీయము కటకము - కటకమును శని, బుధ, గురువులు చూచు చున్నారు. కటకము జల స్థానము చంద్రుడు. జలమునకు అది పతి. చంద్ర కుజులు లాభస్థానమున పాపులైయుండ అష్టమాధిపతి యగు గురువు చంద్ర కుజుల చూచుచున్నాడు కుజ చంద్రులకు వెనుక శుక్రుడున్నాడు. దశమమున సూర్యుడుండి చతుర్థమును చూచుచున్నాడు, చతుర్థము బావిగాన బావి నిలుచునుగాని నీళ్లు తక్కువగా వేసవి కాలములో నుండును. వర్షాకాలములో మూడోమట్టు వరకు నీళ్ళు వచ్చును. శని, బుధులు కటకమును చూచుటవల్ల - యజమానికి పంచమమును చంద్రుడు చూచుటవల్ల బావి త్రవ్వ యోగము యోగభంగము కలిగినది. అయినను త్రవ్వియేతీరవలసిన యోగము వల్ల బుద్ధి ఈడ్చుచున్నది. ప్రయత్నము చేసినాడు. శని అన్ని గ్రహములకువెనుకై లగ్న తృతీయము వరకు చూచుటవల్ల చతుర్థము సూర్యునిచే శుభస్థితి చెందుటవల్ల బావి నిలుచునుగాని నీళ్లు దండిగా వుండ జాలవు. శుక్రుడు కుజ చంద్రుల వెనుక పంచమ స్థానము వరకు వచ్చుటవల్ల ద్వాదశ స్థానములలో శని, రవి శుక్రులవల్ల పదకొండు స్థానములు శుభస్థితి చెందినవి. కుజుని ఎనిమిదింటి చూపువల్ల ఆరవ యిల్లు శత్రు గ్రహస్థానముగా నిలచినదిగాన బావి తయారవులోపల శత్రు రోగ ఋణ విపత్తుల గల్పింపవచ్చునుగాని నీళ్లను తక్కువచేయ జాలడు. గడ్డల పడగొట్టలేదు. పంటను నశింపచేయ లేదు. ఈ వృషభ లగ్నమునకు శుక్ర, బుధ, రవి, శని, రాహు గ్రహములు శుభులు-

గురువు, కుజుడు, చంద్రుడు, కేతువు అశుభులు. అశుభులగువారి కిరణ శుభులచే లయమగుటవల్ల నీళ్లు, పంట, బావి మూడు నిలుచు చున్నవి చార=రవి = ధనిష్ఠ 4 చంద్ర = ఉ.బా3 = కుజ = పూ.భా 3 రాహు = ఆరుద్ర1 = గురు = అనూరాధ 3 = శని = స్వాతి 2 బుధ = ఉ.షా 4. కేతు మూల 3. శుక్ర పూ. బా. 3

<table>
<tr><td>కు<br>చ</td><td>ల</td><td></td><td>రా</td></tr>
<tr><td>ర శు</td><td colspan="2" rowspan="2">16-2-83<br>ఉ॥ 10-30</td><td></td></tr>
<tr><td>బు</td><td></td></tr>
<tr><td>కే</td><td>గు</td><td>శ</td><td></td></tr>
</table>

ఆదే దినము మేష లగ్నము. మేషమునకు శుభులగు గురు, కుజ, రవి, చంద్ర, కేతు గ్రహములు పాపులగు శని, బుధ, శుక్ర, రాహు గ్రహములతో లయమయి పోయినవి, చతుర్థమును శని, బుధులు చూచుటయు శని కటకము వరకు శుభ గ్రహ కిరణములు లయము చేయుటయు-శుక్రునిచే కుజ, చంద్ర కిరణములు లయమగుటయు గలదు. లగ్న చతుర్థము కటకము భావి ప్రబల యోగముండికూడ శని, బుధ, శుక్రులవల్ల శుభ గ్రహముల బలము నశింపయి వుండుటచేత నీళ్ల ఎక్కువగా నుండవు. బావి గడ్డలు పశ్చిమ, ఉత్తరముల నుండి పడు చుండును. కడకు బావి నిలుచుట కష్టము. ఆ భూమి విక్రయమగును. బావిలో స్త్రీలు పడుదురు. శుభగ్రహ స్థానమయ్యు భూమికి జలమునకు కారకులగు కుజ చంద్ర గ్రహములు బలీయులయ్యు ప్రయోజనములేక పోవుచున్నది. ఒక కారు వర్షాకాలము నీరుండును, వేసవికాలమునకు కష్టముగా నుండును. ఫలము చక్కగా రాదు. అర్ధ పంట లభించును.

| | | | |
|---|---|---|---|
| | ల | | రా |
| శు<br>చ | 17-1-83<br>12-30 | | |
| ర<br>కు | | | |
| కే<br>బు | గు | శ | |

ఈ జాతకమునకు గురు, కుజ, రవి, చంద్ర కేతు గ్రహములు శుభులు, శని, బుధ, శుక్ర, రాహు గ్రహములు పాపగ్రహములు. శుభగ్రహములకు శని వెనుకై కటకము వరకు చుట్టి నందువల్ల అష్టమము నుండి గురువు కటకము చూచుటయు సూర్యుడు శుక్రునకు వెనుకై కటకమును చూచుటయు, కటకము లగ్న చతుర్థ మగుటయు, చతుర్థ స్థానాధిపతి చంద్రుడయ్యు లగ్నాధిపతితో ఏకాదశమమున కలిసి యుండుటయు గలిగి బావిలో నీళ్లు తక్కువగా నున్నవి. శని కటకము వరకు చుట్టియుండుటవల్ల శుభగ్రహబలము తగ్గిపోయినది. పంచమమగు సింహమును కుజ చంద్రులు గూచుటవల్ల లగ్న పంచమములో జలము దండిగా నున్నదని భావము. శని చతుర్థమును చూచుటవల్ల బావి పశ్చిమములో గడ్డ అప్పుడప్పుడు పడుచుండును, చతుర్థము భూమి భావి గాన పంటకూడ నాలుగింట ఒక భాగము తక్కువగా నుండును. భూమికి జలమునకు కారకులు లాభస్థానమున నుండుటవల్ల గొప్ప యోగమయ్యు శని వెనుకై చతుర్థమువరకు చుట్టియుండుటవల్ల యజమానికి సంతృప్తి యివ్వజాలకుండును. ఈ విషయాదుల గమనించి చెప్పవలయును. చతుర్థమువరకు శుభగ్రహము బలవంతుడై చుట్టియున్న భూమి, జలము పంట కొదువ లేకుండును. పాపగ్రహ వీక్షణ చతుర్థముపైయుండుటగాని శుభగ్రహములకు వెనుకై చతుర్థము వరకు చుట్టియుండుటగాని వుండిన భావి కష్ట పెట్టును. గడ్డలుల్లిపడును. పంట తక్కువగును. నీళ్లు ఎక్కువగా నుండవు. నీళ్లలో రుచి తక్కువగును.

శ్రీ:- స్వామి! ఊటలు ఏ దిశనుండి వచ్చును? ఎన్ని ఊట లుండును? ఎన్ని అడుగులలో నీళ్లు దండిగా నుండునని అడుగుదురు ..ట్లు చెప్పవలయును?

గు:- వత్సా! ఏ ఏ దిశాధిపతులు శుభులై చతుర్థము చూతురో ఆ దిశల నుండి నీటి ఊటలు వచ్చును. గ్రహము ఎంత బలముతో చూచునో అంత బలముతో ఊటవచ్చును. ఎన్ని గ్రహములు చూచునో అన్ని ఊటలుండు. చంద్రుడు చూచినట్లైన వాయువ్య దిశనుండి ఊట వచ్చుటయేగాక బావి చుట్టు నీరు వచ్చు చుండును. పాపియై చూచిన నీరు కారుచుండునేగాని అక్కరకు రావు. బావి నిలువదు-శుభగ్రహములు ఎచ్చటెచ్చట నుండి ఎక్కడ చూతురో అక్కడ నీళ్లుండును. ప్రకృతము ఈ కుండలిలో ఏకాదశమమున కుజ చంద్రులుండుటవల్ల మేషాదిగ కుంభము పదునొకటగుటవల్ల ఒక్కొక లగ్న ప్రమాణము అరడుగు లగుటచేత 66 అడుగులలో దండి నీరు గలదు. అదే కుజ చంద్రులం అయిదవ యింటిని చూచు చున్నారుగాన అయిదార్లు 30 అడుగులలో నీరుండును. గురు, కుజులు ద్వితీయమును చూచుచున్నారు అందువల్ల 7, 8, 9, 10, 11, 12 అడుగులలో నీరుండును. అంతవరకు నీరు వచ్చును. (రెండవ మట్టు) గురువు చతుర్థమును చూచుచున్నాడు. గాన నాల్గవ మట్టులో నీరుండును. గాని శని అంతవరకు వెనుకనుండి చూచు చుండుటవల్ల తక్కువగా నీరుండును. బుధ, శుక్ర, రాహు గ్రహములు కూడ చతుర్థము వరకే చూచినారు. పంచమ షట్ స్థానముల పాపులెవరు చూడ కుండుటవల్ల 30 అడుగులలో దండిగా నీరుండునని తెలియ వలయును.

శ్రీ:- స్వామి! గ్రహబలము ననుసరించి అన్నారు బలా బలముల తెలుసుకొనుటెట్లు?

గు:- వత్సా! గ్రహబలము తెలుసుకొనుట ముందు చెప్పితిని అయినా చెప్పెదను విను- గురువు ప్రతి యింటిలో 12నెల లుండునుగదా ఒక్కొక భాగలో ఒక నెల వుండును. గురువు తానున్న రాశిలో ఏ తేది చేరినాదో తెలియునుగదా, ఆ రాశిని విడుచువరకు లెక్కించి పండ్రెండుతో భాగించిన ఒక్కొక భావములో ఎన్ని దినము లుండునో తెలుసుకొని ప్రకృతము ఆ రాశిలో ఎన్నివ భావములో వున్నది తెలుసుకొననగును గదా, బావి చతుర్థ భావము గదా గ్రహము చతుర్థ భావమునకు లోపల గాని చతుర్థమందుగాని వుండిన బలవంతుడుగా నెరుంగుము. లేక ఆ భావమునకు ముందుకు యెంత జరిగియుండునో అంత దుర్బలమని యెరుంగుము.

| | | | |
|---|---|---|---|
| | ర బు | శు | రా శు |
| | | | |
| | | | |
| కే చ | గు | శ. ల | |

ఈ జాతకునకు చంద్రుడు శుభుడు, ఆ చంద్రుని చతుర్థ పంచమాధిపతియగు శనియు లగ్న అష్టమ స్థానాధిపతియగు శుక్రుడు చంద్రుని చూచు చున్నాడు. చంద్రుడు గురు నింటిలో నున్నాడు. గురువు ఈశాన్యమూల అధిపతి గాన ఆ భూమిలో ఈశాన్య మూల బావి త్రవ్వవలయునని భావించవలయును. బోరింగు వేసిన 54 అ. 60 అ. 90 అడుగులు ఈశాన్య మూలలో వేయువలయును, 54 అడుగుల స్థానమును చంద్రుడు చూచు చుండెను. 54అడుగులలో శుక్ర రాహువులున్నారు. ఇది తొమ్మిది మట్లు అన్నైవై అడుగుల స్థానము కటకము చంద్ర గృహము, అక్కడ చాలక పోయిన 90 అ. స్థానం ధనుస్సు చంద్రుడున్నాడు. శనిశుక్ర రాహువులు

చూచుచున్నారు. అది ఈశాన్య మూల గాన 90 అడుగులలో నీళ్లు సమృద్ధిగా నుండునని తెలుపవలయును. ఇది పదునైదు మట్లు. 90 అ.

| | | | |
|---|---|---|---|
| | బు | శు ర | రా హు |
| | 17 5-83 పుష్యమి | | చ |
| | | | |
| కే | గు | ల శ | |

ఈ జాతకమునకు చంద్రుడు శుభుడై స్వక్షేత్రమున నుండెను. లగ్నాత్‌గల శని పదింట చంద్రుని చూచుచుండెను. లగ్నాధిపతి నవమమున నుండెను నవమాధిపతి సప్తమమున నుండెను. శని శుక్రులు తృతీయమును చూచుటవల్ల మూగవ మట్టులో నీరుండును. చంద్రుడు నాలవ మట్టును చూచుటవల్ల నాలవ మట్టులో నీరుండును. ఏడవమట్టులో నవమాధిపతి వున్నాడు గాన ఏడవమట్టులో నీరుండును. నవమమున లగ్నాధిపతి వుండెను. అక్కడ నీరుండును. దశమమున శుభుడై నీటికి అధిపతియగు చంద్రుదున్నాడు. గురు వీక్షణ చంద్రునిపై లేకుండిన సముద్ర మున్నట్లు జలముండి యుండును. అయినను సంపూర్ణ జలముండును. ఈ జాతకునకు దశానుకూలత యుండిన మహారాజుగా వెలుగును. దశానుకూలత లేదుగాబట్టి ఏదోవకటి చిక్కువచ్చుచుండును. వచ్చినను తొలగిపోవుచుండును. చక్కగా గమనింపుము.

| | | | |
|---|---|---|---|
| | బు | శు ర | రా కు |
| | 17-5-83 | 11, 24 | ల చ |
| | పునర్వసు 4 | | |
| కే | గు | శ | |

ఈ జాతకునికి లగ్నాత్ చంద్రుని శని గురువులు చూచుచుందిరి. దశమ చతుర్థముల శని బుధులు పాపులై యుందిరి దశానుకూలత లేకుండెను. గాన కష్టము పైన బావి తయారగును గడ్డలు నిలుచుట కష్టము. అప్పుడప్పుడు పడుచునే వుండును. కటక చంద్రుల శని చతుర్థము నుండి చూచుటవల్ల తక్కువగా నీరుండును లేక దండిగా నీరుండిన నీటిలో పులుపుగాని, చేదుగాని, ఉప్పుగాని వుండి భూమికి సమన్వయముగాక పోవును. తక్కువగా నీరుండిన ఒక రకముగా నీరుండును. భూమికి నీరుకు సరిపోవును-చతుర్థ శుద్ధి లేదుగాబట్టి జాతకుడు చేసిన కార్యము లన్నీ చెడిపోవు చుండును. అయినను దశానుకూలత గలదుగాన శని, బుధ దశలు పోయినప్పటి నుండి యోగించును నీరుండును. బావి నిలుచును-భాగ్య పంచమాధిపతులలో ద్వితీయాధిపతి యగు రవి అశుభుడై కలియుటవల్ల, లగ్నాధిపతిని లగ్నమును శని చూచుటవల్ల యోగము యోగ భంగమయినది. అయినను దశానుకూలత వల్ల నూటికి 80 భాగలు యోగించినది. ఈ లగ్నమునకు పాపులయిన శని బుధులు చతుర్థ దశమములందు వుండుటవల్ల యోగభంగ మైనది. శని, బుధ గ్రహ దశలు దశానుకూలతవల్ల బాల్యముననే పోవుటవల్ల యోగము అనుకూలమై బావి నీరు నిలచినది. దశ అనుకూలముగాక యుండిన బావి నిలువదు. నీళ్ళలో ఉప్పుగాని చేదుగానివుండి బావి కూలి పోవును. అట్టిది శని బుధ దశలు పోవుటవల్ల యోగప్రదమయినదని తెలియవలెను, దశ అనానుకూలత గలిగినవాని జీవితము కష్టముగా

నుండును. జనన కాలములో పాపులచేత శుభులు లయమై పోయివుండినను దశానుకూలత గలిగిన రాను రాను శుభగ్రహములు బలీయములై సర్వసుఖములు చేకూర్తురు. దశ అనానుకూలమైన రాను రాను జీవిత సౌఖ్యములు దిగజారిపోవును.

| | | | |
|---|---|---|---|
| | బు | ర<br>శు | కు<br>రా |
| | | | |
| | | | ం |
| చ<br>కే | గు | శ | |

6
6
12
10
22
7
29
18
47

ఈ దినము బావిలో నీళ్లు తక్కువై బోరింగు వేసుకొనుటకు అడిగినారు. శని తృతీయము నుండి కటకము వరకు చుట్టియుండుటవల్ల రవి కుజులు దశలు పోవుటవల్ల శని వెనుకై గురువు ముందుండుటవల్ల చంద్రుడు పాపియగుటవల్ల నీళ్లు వేశవి కాలములో తక్కువగా నుండును బావి ఆరుమట్లు త్రవ్వినారు. 6, 7మట్ల గృహముల వాడు పాపియగుటవల్ల నీళ్ళు లేవు. 8వ మట్టును గురువు చూచుటవల్ల అక్కడ కొంత నీరుండును. తొమ్మిదవ మట్టులో బుధుడుండుడవల్ల, శని చూచుటవల్ల నీరు అక్కడ లేదు. పదియవ మట్టులో నీరు పారుచున్నదిగాని రవి కుజ దశలు పోవుటవల్ల కొరత నీరు గలదు. గురువు చూచుటవల్ల కొంత నీరు గలదు. పదకొండో యింటిలో శుక్ర రాహువు లుండుటవల్ల నీరు లేదు. 12వ యిల్లు కటకమై యుండుటచేత నీరు గలదుగాని శని

చూచుటవల్ల కొరతగా నీరుండును. అక్కడికి ద్వాదశ లగ్నములు అయిపోయినవి. 72 అడుగులు అయినది. మళ్లీ కుండలి తిరుగవలసి వచ్చినది. లగ్నమును కుజుడు చూచెనుగాని దశపోయినవాడు ద్వితీయ మును ఎవరు చూడలేదు. తృతీయమును శని బుధు లాక్రమించుటవల్ల నీరుండదు. చతుర్థమున గురుడుండుటవల్ల వున్నంతలో నీరు అక్కడుండును. బోరింగు అక్కడికి పోవలయును. అక్కడికి 96 అడుగులు బావి కొలత అయినది. అందులో 36 అడుగులు బావి త్రవ్వినారు. 96 అడుగులలో 36 అడుగులు బావి త్రవ్వినారు. 96అ. లలో 36అడుగులు తీసివేసిన 60అ. బోరింగు పోవలసి యుండును. అంతకుమించి పోయిన నీరు మళ్లీ నిలచిపోవును. అయిదవ యింటిపై శని వీక్షణ గలదుగాన నీరును బంధు చేయును. ఇక్కడికికూడ నీరు తక్కువగా నుండునుగాన నాలుగైదు యెకరములకే నీరు పారగలదని గ్రహించవలయును. వర్షా కాలము ఎక్కువగా నీరుండునుగాన ఎక్కువ పొలమునకు సరిపోవును. గమనించుము.

| | | | |
|---|---|---|---|
| | | రా చ | శు |
| | | | ర |
| | | | బు శ |
| | గు కే | శ | ల |

| |
|---|
| 4 |
| 10 |
| 14 |
| 7 |
| 21 |
| 18 |
| 39 |
| 16 |
| 55 |

ర: ఆశ్లేష 1, చ: కృత్తిక 2, కు; పునర్వసు 3, రా; మృగశిర 2, గు: అనూరాధ 2వ, శ: చిత్త 4, బు: మఖ 3, కే; జ్యేష్ఠ 4, శు: పుబ్బ 1.

కన్యాలగ్నమునకు సూర్యుడు మినహా అన్ని పాపగ్రహములు, దశలు 42 వయస్సుకు గురు స్వభుక్తిపోయి అర్ధనకు ప్రారంభమై 55 వయసు పోయి శనిదశ ప్రారంభమైనది మొదలుకొని గృహములు కట్టుట, భూములు కొనుట, వడ్డివ్యాపారము నడుపుట ధనము కొంతవరకు నిల్వ చేయుట, బావులు త్రవ్వుట, వనములు వేయుట, బంధుమిత్రులలో విలువ గలుగుట వచ్చి బావి త్రవ్వ నారంభించినాడు. శని కటకమును చూచుటవల్ల చతుర్థమును చూచుటవల్ల నాలుగు మట్లలో నీరుపడినది. ఆరవ మట్టును రెండు శుభగ్రహములు చూచుటవల్ల ఆరవ మట్టులో సమృద్ధిగా నీరు పడినవి. భూమి ఎక్కువగా నుండుటవల్ల పదకొండో మట్టువరకు బోరింగు పోయినాడు. కావలసినన్ని నీరు లభించినవి, అక్కడ భాగ్యరాజాధిపతుల కలయిక వున్నది గాబట్టి జలము కలుగుటకు కారణమైనది. ఈ జాతకునకు దశానుకూలత గలిగినది. అందువల్ల యోగము గలిగినది. దశ అనానుకూలతవల్ల మానవుడు దుఃఖముల పాలగును. దశానుకూలత గలిగిన మానవుడు అభివృద్ధి చెందుచున్నాడు దశానుకూలత జాతకునికి ప్రాణము.

| | | | |
|---|---|---|---|
| శు | శ ర | బు రా | కు |
| | 1910-5-2 జననము | | |
| చ | | | |
| ల | కే | | గు |

ఈ జాతకుడు కుజ దశ ప్రారంభమున జన్మించినాడు. గురు దశలో మూడు బావులు త్రవ్వినాడు చంద్రుని యెన్ని గ్రహములు చూచునో అన్ని బావులు త్రవ్వవలసియుండును ఇక్కడ గురు, కుజ శనులు చూచుచున్నారు. మూడు బావులయినవి చతుర్థమున. ఆరవ

యింటివాడు శుక్రుడు దిట్టముగా కూర్చున్నాడు. చంద్రుడు అష్టమాధిపతియై తన ఇల్లగు కటకమును చూచుచున్నాడు. జలరాసులగు మీన, మేష, కటక, వృశ్చికములు పాపత్వము చెందినవి. మీనము శుక్రునితో మేషము శనితో కటకము చంద్రునితో వృశ్చికము బుధ రాహువులతో పాపత్వము చెందినవి. గురు, కుజులు చంద్రుని చూచుటవల్ల నీళ్లు పడినవిగాని ఒక ఊట మంచిది మరొక ఊట పాడు చేదుగా వచ్చుటచేత త్రాగుటకు ఉపకరించ లేదు. చెట్టు బాగ బ్రతుకవు. ఆ చోటుకూడా మిగులదు. అన్యుల వశమౌటయో లేక విక్రయించుటో జరుగును. చతుర్థమున ఉచ్చ స్థితిలోనున్న శుక్రు డుండుటవల్ల గురువు దుర్బలుడౌటవల్ల స్థలము బావి నిలువలేదు. కుజుడు కుజ క్షేత్రములు రెండు చెడిపోయినవి. బుధునితో వృశ్చికము శనితో మేషము శని మూడింటి చూపుతో కుజుడు చెడుటవల్ల కుజుని బలము సంపూర్ణముగా చెడినది. పరికించుము.

శ్రీ శారదా సద్గురు రాఘవేంద్రార్పణమస్తు.



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః



శ్రీ శారదా దేవతాభ్యోనమః శ్రీ లక్ష్మీ నృసింహాయనమః

శ్రీ సూర్యనారాయణాయనమః

శ్లో॥ శివం హరిం విధాతారం తత్పత్నీస్తత్సుతాన్ గురూన్.
నత్వా సమస్త ప్రత్యూహశాంతయే మంగళాయచ.

## గ్రామ వాస్తు.

శ్రీ:- స్వామి! గ్రామములు కొన్ని అభివృద్ధిజెందడము కొన్ని నశింపు గావడము, కొన్ని చావక బ్రతుకక మధ్యలో ఊగులాడడము కొన్ని నశింపు పూర్తిగావడము జరుగుచున్నవే కారణ మేముండును.

గు:- వత్సా! ఒక గ్రామమును కట్టవలయునన్న చాలా విష యముల గమనించవలసియున్నది. ఎట్లన ముందు ఆ స్థలము ఏ గ్రహ పాలనలో వున్నది, ఆ సర్వే నంబరులో ఎన్నిబాగలున్నవి, ఆ భాగలలో మిత్రులా, శత్రువులా అన్నది ఒకటి చక్కగా పరికించవలయును. ఆ స్థలము విష్ణుపరమా, శివ పరమా చూచుకొనవలయును. ఆ స్థలము గురు పాలితమైన గ్రామాభివృద్ధియగును. ఇహాపరములను రెండింటిలోపరం తుకు పనికివచ్చువారుగా నుందురు. శివపతమయిన, ఇహాపరమైన సుగ్గ ములు గలుగును. చతుర్థ దశమములలో ఒకటి రెండు శుభగ్రహము లున్న స్థలమును చూడవలయును. నీరు మంచిదిగా నుండవలయుననిన చంద్రుడు కటకము శుభస్కరముగా నుండవలయును. ముఖ్యమైనది నీరు గాబట్టి దీనిని గమనించవలయును. శనిపాలితములో తులా లగ్నమునకు

నీటి బలమున్నది. దశమ కేంద్రాధిపతి గాన మిగతా మకర, కుంభ, వృషభ, మిధున, కన్య లకు చంద్రుడు పాపి గాన శ్రేష్ఠమైన నీరు లభించదు. గురు లగ్నములలో మీన, మేష, కటక, వృశ్చికములకు చంద్రుడు కటకము శుభస్కరముగాన మంచి నీరు లభించును. గమనించ వలయును. సింహ ధనుస్సులకు మిగుల పాపిగాన పనికిరాదు. పరికించ వలయును. (జలవాస్తును పరికించవలసి వచ్చును.)

శ్రీ:- స్వామి! గ్రామము నియమించు వారిపై ఆధారపడి యుండునా లేక భూమిపై ఆధారపడి గ్రామముండునా తెలుపుడు.

గు:- వత్సా! ఆ గ్రామమును కట్టించ ప్రయత్నించువారి జాతక బలమెట్లుండునో అట్లు ఆ గ్రామ బలాబలము లట్లుండును. అనగా పంచమములో నవమ స్థానాధిపతి యుండిన నొక కార్యముచేసి చేసిన కార్యమువల్ల పుణ్యము గడింపవలయునను తలంపు గలుగును. చేయును చేసినది శాశ్వతముగా నిలువవలయుననిన చతుర్థములోగాని దశమములో గాని లగ్న పంచమ నవమ స్థానాధిపతులలో నొక్కరుండి ఆ గ్రామము వన్నె గడియించును. దినదినాభివృద్ధిగా గొప్ప గ్రామ మగును. కీర్తి గౌరవ ప్రతిష్ఠలతో ఆ గ్రామస్తులు పెంపొందుదురు. చతుర్థ దశమము లలో శుభగ్రహమున్నవారు ఏ కార్యము చేసినా అది నశింపుగాక అభి వృద్ధి చెందును. కార్యసాధకుని జాతక మెట్లుండునో అట్లే ఆ గ్రామము తయారగును. స్థలము అట్లే లభించును. శతవిధ ప్రయత్నములు చేసినా అది మారదు. కాలానుగుణ్యముగా పట్టణము పల్లె కాగలదు. పల్లె పట్టణము కాగలదు. ఊరు కాడు కాగలదు. కాడు ఊరు కాగలదు. గ్రామమును స్థాపించువారి జాతకముపై ఆ గ్రామము ఆధారపడియుం డును. చావిళ్లు, సత్రములు, భజన మందిరములు, గృహములు, బావులు

కోనేర్లు, దేవాలయములు మొదలగు స్థాపిత నిర్మాణములు జాతకుని చతుర్థముపై శంఖుస్థాపన ముహూర్తముంచిన చతుర్థముపై ఆధారపడి యుండును.

వత్సా! ఒకటి ఉదాహరణ: కర్నూలును ఆంధ్రకు రాజధానిగా చేయునప్పుడు ఏ మహా మహుడు ముహూర్తము పెట్టినాడో మీన లగ్నము నియమించి చతుర్థములో శుక్ర గ్రహము నుంచినాడు. మీన లగ్నమునకు తృతీయ అష్టమాధిపతియగు శుక్రుని చతుర్థములో నుంచ వచ్చునా లేదా అన్న విషయము గమనించలేదు. పూర్వులు నియమించిన గురు, శుక్ర శుద్ధ బుధ పూర్ణ చంద్రులు శుభులు. తతిమ్మా ఐదుగురు శుద్ధ పాపులన్న వాక్యముపై ఆధారపడి శుక్రుని చతుర్థమున నియమించి నాడు. చతుర్థము రాజ్య స్థాపనకుగాని గృహ స్థాపనకుగాని ముఖ్యమైన దని గ్రంధ కారకులు వ్రాయనందున స్థానాధిపత్య దోషమువల్ల గ్రహ మునకు పాపత్వము గలిగినదిగాని నవగ్రహములలో శుద్ధ పాపులు లేరని తెలుపనందున తెలిసినవారు లేనందున సూర్యుడే క్రూరుడైన లోకమెక్క డున్నదనువారు లేనందున ఊర్ధ్వలోకములలో పాపులున్నారా అని ప్రశ్నించినవారు లేనందున జోస్యము దెబ్బతిన్నది వత్సా!. చతుర్థము బ్రహ్మ స్థానము. చతుర్థములో పాపులున్న రాజ్యములు, గృహములు, గృహోపకరణములు, స్థాపిత నిర్మాణములన్నియు ధ్వంసమైపోవును. ధన బలముతో నిర్మించినను కడకు తాను చూచుచుండగనే నాశనమై దుఃఖింపచేయును. గాన కర్నూలు ఆంధ్ర రాజ్య స్థాపన పాడయిపోయి మరొకచోటు చేరెను. ఆ చోటునుకూడ యిట్లే చేసిరి.

గ్రామము నియమించువారికి చతుర్థ దశమములలో శుభులుండ వలయును. ఇట్లు గ్రహములున్నవారు చేసిన నిర్మాణములు చాలా కాల

ముంటూ వన్నె గడించును. వంశాభివృద్ధి యగును. వంశోద్ధారకులు జన్మింతురు. నిర్మాణము చేయువారి జాతకముపై ఆధారపడియుండును. ఆ జాతకుని చతుర్థమందు ఎట్టి గ్రహముండునో అట్టి స్థలమే లభించును

శ్రీ:- స్వామి! గ్రామమునకు ఎట్టి లగ్నము నిశ్చయింప వలయునో లగ్నములలో ఏ లగ్నము పెట్టిన బాగుండునో తెలుపుము.

గు:- వత్సా! లగ్నములలో లగ్నోత్తమ లగ్నములు నాలుగు మేష, వృషభ, తుల, వృశ్చికములు. ఎందుకనగా అయిదు శుభ గ్రహములు, నాలుగు పాపగ్రహములుగాన ఉత్తమ లగ్నములైనవి. వృషభ తుల లు స్త్రీ లగ్నములు యౌవన దశలో గలవి. ఇహబలము గలవి మేష వృశ్చికములు పురుష లగ్నములు. యౌవనదశలోగలవి. పరంతు బలముగలవి గాన ఈ నాలుగు లగ్నములలో నొకటి శ్రేయోదాయకము. మిగతా ఎనిమిది లగ్నములకు నలుగురు శుభులు, అయిదుగురు పాపులు గాబట్టి గొప్ప గొప్ప కార్యకర్తలు, రాజులు, విశ్వవిఖ్యాతి గడించెడి మహాపురుషులు, ఏదైన ఒక ఘనకార్యము కనిపెట్టు మేధావులు, గొప్ప యోగులు, యోధులు పై నాలుగు లగ్నములలో జనించుచుందురు. గాన వీలయినంతవరకు అయిదుగురు శుభులయిన లగ్నములనే చూచుట శ్రేయము.

శ్రీ:- స్వామి! ఈ నాలుగు లగ్నములలో చక్కని ముహూర్తము దొరుకకపోయినయడల యెట్లు?

గు:- వత్సా! చతుర్థము బ్రహ్మస్థానము సకల వస్తు సముదాయము సృష్టించు స్థానముగాన యిక్కడ ఒక శుభగ్రహము ముఖ్యముగా నుండవలయును. సప్తమము రుద్రస్థానము. ఇందులో సంసారము

కళత్రము, కళత్ర సుఖము, సకాల భోజనము, సకాల నిద్ర, సకాల వివాహము, సకాల సౌఖ్యములు, విరామము మొదలగు సుఖములుగల స్థానము గాన సప్తములో నొక శుభ గ్రహముండవలయును. దశమము వృత్తి, ఉద్యోగ వ్యాపార గౌరవప్రతిష్టలు జీవిత రక్షణోపాదులు గల స్థానము కాబట్టి యిక్కడొక శుభగ్రహ ముండవలయును. ఇవి మూడు స్థానములు ముఖ్యాంగములుగాన గమనించి గ్రామ నిర్మానమునకు ముహూర్తముంచవలయును. ఈ ముమ్వురిని పాపగ్రహములు చూచిన సత్ఫలములు నశింపై దుష్ఫలము వృద్ధిచెందును. జాగ్రత అవశ్యకము

శ్రీ:- స్వామి! లగ్న పంచమ నవమ స్థానాధిపతులే శుభులన్నారు. మూడు స్థానములలో ముమ్వురుండిన మిగులు తొమ్మిది స్థానముల గతేమిటి?

| | | | |
|---|---|---|---|
| | కు శు | | శ ర బు |
| | | | |
| | | | ల గు |
| | చ | | |

ఈ జాతక చక్రములో ఎనిమిదింట్లనుశుభగ్రహములు అక్రమించినవి చూదుము. బుధుని యిల్లు కన్య ఒకటి, శుక్రుని ఇల్లు వృషభమురెండు శని యిల్లు ఒకటి మూడు ఈ లగ్నములు మూడు తప్ప మిగతా తొమ్మిది లగ్నముల శుభులు ఆక్రమించి వున్నవి. అందువల్ల ధనము, విద్య, గౌరవము, సంసార సుఖము, పరివారము మొదలగు సంపదలు కలిగియున్నవి. విశాఖ నక్షత్రము జననమగుటవల్ల దశానుకూలత గలిగినది. పాపగ్రహములగు శని, బుధ, శుక్ర గ్రహ దశలు పోయినవి. చంద్రుని చంద్ర క్షేత్రమును కుజుడు చూచుడవల్ల

చంద్ర దోషము పోయినది, ఇట్ల గమనించవలయును. దశానుకూలతగల నక్షత్రమైన ప్రబల యోగముగా నుండును.

శ్రీ:- స్వామి! దశానుకూలత నక్షత్రములు ఏవో తెలుపుడు.

గు:- వత్సా! గురుపాలిత లగ్నములకు పునర్వసు విశాఖ పూర్వాభాద్ర నాలవ పాదములో జననమైన శని, బుధ, శుక్ర, గ్రహ దశలు పోవును. శనిపాలిత లగ్నములకు భరణి, పుబ్బ, పూర్వాషాఢ నాలవ పాదములో జననమైన రవి, చంద్ర, కుజ, గురు దశలు పోవును అటుపై మంచికాలము ప్రవేసించునుగాన దశానుకూలత శ్రేయోదాయకము. ఇట్లు దశానుకూలతగల గ్రామములు జాతకులే అభివృద్ధి జెందుచున్నారు. అభివృద్ధి జెందినారు. ఇది గ్రామములకు, ప్రజలకు సర్వ ముహూర్తములకు ప్రాణముగా నుండును.

శ్రీ:- స్వామి! గ్రామములో ఏలాంటి వృక్షములుండవచ్చును ఏలాంటి వృక్షములుండకూడదు.

గు:- వత్సా! ఫలవృక్షములు పుష్పజాతులుండ వచ్చును. దేవతా వృక్షములు భూత నివాస వృక్షములుండరాదు. వీటివల్ల గ్రామమునకు అనిష్ట సంభవించును. వేప, జమ్మి, రావి, మఱ్ఱి, జివ్వి, తాండ్ర మారేడు చెట్లు దేవతా వృక్షములు భూత నివాసములుగాన గృహముల సమీపములలో గృహములలో నుండరాదు. టెంకాయ, పనస బాదాము, మామిడి, వెలక, నేరేడు, అల్లనేరేడు, రామబాణము, పొన్న, పారిజాతము మొదలగు వృక్షములు, పూల చెట్లు శ్రేయోదాయకము.

శ్రీ:- స్వామి! రూపము, విద్య, ధనము మూడు సమానము లన్నారు. ఈ మూడుగల గ్రామముండవలయునన్న కష్టము. వీటి వివరములు తెలియజేయుడు.

గు:- వత్సా! లగ్నాధిపతి వుండబడిన స్థానమునుబట్టి లగ్నములో వుండబడిన గ్రహమునుబట్టి స్థూలదేహమేర్పడును. ఇందులో అవయవములు యేర్పడును. ద్వితీయ, సప్తమ, ద్వాదశములలో శుభ గ్రహములున్న యెడల ముఖము చాల్గా అందముగా నుండును. లేదా ద్వితీయమున శుభ గ్రహమున్నయడల అందముగా నుండువారును కుటుంబములు చక్కగా నుండువారును కంఠధ్వని చక్కగా నుండువారును పలుకుబడిగలవారు పుట్టుచుందురు. పంచమములో నొక శుభ గ్రహముండినను చూచినను విద్యా వివేకము, వినయ సంపన్నత, కవితాశక్తి గ్రామాధికారము, విద్యాప్రసక్తి ప్రజలలో పలుకుబడిగలవారు పాండిత్యబలము, ప్రజ్ఞ, బుద్ధిబలము గలవారు పుట్టు చుందురు- నవమ స్థానమున నొక శుభగ్రహముండిన పితౄర్జితము, దైవభక్తి శుభకార్యాసక్తి తీర్థయాత్రాఫలము, నిల్వధనము కొన్ని దైవకార్యములపై ఆసక్తి మంచితనము, పలువురిలో ఘనత ఈలాంటి మంచి కార్యములు చేయువారు పుట్టుచుందురు. గ్రామ నిర్మాణకర్తకు ఇట్టి శుభ లక్షణములు గలిగియుండవలయును.

శ్రీ:- స్వామి కొన్ని గ్రామములకు మంచిభూమి వనములు బావులు గలిగి గొప్ప పట్టణముగ నభివృద్ధి చెంది సకల సంపదలతో నున్నవే కారణమేమందురు.

గు:- వత్సా చతుర్థము సకల సంపదలకు మూలము గాన అన్ని వస్తువులు గలుగును. అచ్చటొక శుభగ్రహ ముండవలయును. పంచమాధిపతి చతుర్థ మందుండిన గృహములు-గృహోపకరణములు, భూములు వనములు బావులు బంధుమిత్రులు వాహనములు సేవకులు అభివృద్ధి చెందుచుండును. గ్రామాభి వృద్ధియై పట్టణముగా మారును.

ఆ గ్రిహము పురుష గ్రహమైన, దేవాలయములు, భజనమందిరములు, చావిళ్లు సత్రములు మొదలగునవి కూడా అభివృద్ధియగును. శిధిలము లుగాక చాలాకాలముండును. సకల సంపదలు గలుగును.

శ్రీ:- స్వామి ఆగ్రామము పుణ్యస్థలముగా మారుటకు కారణ మేమందురు.

గు:- వత్సా పంచమ నవమాధిపతులు చతుర్థములో నున్నచో ఆ గ్రామము పట్టణముగా మారి యశస్సంపన్నులుగా నుందురు. గొప్పగా విద్య నభ్యసించు వారుగా జన్మింతురు. తరతరాలుగా అభి వృద్ధి చెందును. ప్రిభుత్వరంగమున ప్రజారంగమున వన్నె గడింతురు. గ్రామము నిర్మించు జాతకునిపై ఆధారపడియుండును. తీర్థ యాత్రి స్థలముగా మారును.

శ్రీ:- స్వామి స్త్రీ గ్రహములుండిన చతుర్థ పంచమములలో స్త్రీల ప్రాబల్య ముండునందుర.

గు:- వత్సా ఏ గ్రిహ బలముండిన ఆ గ్రహకారకత్వము లచ్చట ప్రికాసించును శుక్రుడు స్త్రీ గ్రిహము చతుర్థ దశమములందుండిన స్త్రీ లు రూపవంతులు బుద్ధిబలము గలవారు. సంగీత సాహిత్యము లందు ప్రవీణత గలవారు. కామకళ ఆ గ్రామములో అపరిమితముగా నుండును వాహనబల ముండును. బుధుడు చతుర్థ దశమము లందుండిన గొప్ప మేధాశక్తి గలవారుగా జన్మింతురు. వైద్యము, వ్యాపారము, మంత్రి యంత్రి తంత్రిములు శక్తివంతమైన యంత్రిములు అధునాతనమైన మారణాయుధములు వ్యావహారిక మేధాశక్తి మొదలగు వాటియందు మేధావులు జనింతురు.

శనిగ్రహము దశమ చతుర్థము లందుండిన ఇనుము మందులు నూనెలు మత్తు పదార్థములు నూనెపయిర్లు మారణాయుధములు సన్యాసులు శక్తి ఆలయములు సృష్టించి లాభము గడింపచేయును. విధురులు విధవలు మెండుగా సృష్టించును. తానున్న లగ్నమెట్టిదో అట్టి వస్తువులపై ఆధారపడును. అనగా గురువు గృహములగు మీన ధనస్సులలో శని మీనమందుండిన మిధున లగ్నమునకు గురువు రెండు యిండ్లను శుక్రునిల్లు వృషభమును మూడింటను, ఏడింట బుధునియిల్లు కన్యను చూచుగాన గురుగ్రహ కారకత్వముల నొసంగును. శుక్ర బుధ కారకత్వముల కొంతవరకు నిచ్చును. ఈ విధముగా గమనించవలయును.

గురువు- శని గృహములలో నుండిన చూచిన శనితో కలిసి యుండినా అర్చకము పౌరోహితము కర్మలు చేయించుట బ్రాహ్మణార్థ భోజనములు భుజించుట మొదలగు నీచకార్యములతో లాభమిచ్చును. ప్రతిగ్రహము తానున్న యింటిని చూచెడి యింటిని బట్టి సుఖదుఃఖముల గల్పించును. తనయిల్లే అయినయడల తనకారకత్వముల స్థానమును బట్టి యిచ్చును.

శ్రీ:- స్వామి ఒక గ్రామమునకు శత్రురోగ ఋణవిపత్తులు మెండుగానుండును దీనికి గ్రామశంఖుస్థాపనాధికారియే కారకుడందురా.

గు - అవును శంఖుస్థాపనాధికారి. జాతకములో షట్స్థానమున పాపగ్రహముండిన శత్రురోగ ఋణ విపత్తులు పరాభవములు హఠాత్ ఉపద్రవములు జీవితాంతము కలుగునే వుండును. శుభగ్రహమున్న జీవితాంతము శత్రురోగ ఋణ విపత్తులుండవు. ఆ గ్రామమున కలహము లుండవు. గ్రామ నిర్మాతకు శత్రు స్థానమగు ఆరింటి నొక శుభగ్రహ ముండిన జీవితములో కష్టములుండవు.

శ్రీ:- స్వామి! ఒక్కొక్క గ్రామములో కొంచమెంచుమించుగా నూరేండ్లు బ్రతుకుచుందురు. దీనికి ఏ స్థానము బాగుండవలెనందురు.-

గు:- వత్సా! అష్టమ స్థానములో లగ్న పంచమ నవమాధిపతులు బలియముగా పాపగ్రహ వీక్షణలేక దశ పోకుండిన నూరేడులు బ్రతుకుదురు. అరింట, ఎనిమిదింట శుభగ్రహములున్నవారే వైద్యులు. వైద్యోత్తములు అష్టమ స్థానములోనున్న శుభగ్రహదశ పోకుండిన ఆ గ్రామ నివాసులు చాలాకాలము జీవింతురు.

శ్రీ:- స్వామి! ఒక్కొక గ్రామమునకు ఇతర ఆస్తులు వచ్చుచుండును. కొన్ని గ్రామములకు ఆస్తులు ఇతరులకు పోవుచుండును. ధనము దుర్వ్యయము చేయువారు పుట్టుచుందురు. కారణ మేమందురు.

గు:- వత్సా! ఏకాదశమమున శుభగ్రహము ఉన్నవారికి ఆస్తులు సంక్రమించును. దుర్లాభముగా ధనము ఆస్తులు లభించును. నవమాధిపతి ఏకాదశమములో నుండిన గొప్పగా ధనమార్జించు మార్గములు లభించును. గ్రహబలమునుబట్టి లాభముండును. పంచమాధిపతియుండిన విద్య గొప్పగా లభించును. లగ్నాధిపతియుండిన దేహ సౌష్టవము, రూపమువల్ల సుఖము లభించును. ఇట్టివారు చాలా తక్కువగా నుందురు

శ్రీ:- స్వామి! కొన్ని గ్రామములలో భక్తులు నియమనిష్ఠలందు ఆశక్తిగలవారు మోక్షాసక్తులు పుణ్య కార్యములపై ప్రీతిగలవారుందురే కారణ మేమందురు?

గు:- వత్సా! ద్వాదశమున లగ్నపంచమ నవమాధిపతులలో నొకరుండిన అట్టివారు పుట్టుచుందురు. దేహరూపేణ పుణ్యమార్జించువారుందురు. అనగా దేవాలయ ప్రదక్షిణ నమస్కారములు చేయుట,

పుణ్యకార్యములలో సహాకరించుట, కార్యకలాపములందు ఒరులకు తోడ్పడుట. ఈలాంటివాటితో పుణ్యమార్జించును. పంచమాధిపతి యుండిన ధ్యాన రూపేణా, విద్యా రూపేణా, భజనతో సంగీతముతో, జ్ఞానముతో పుణ్యమార్జించును. నవమాధిపతి వుండిన మోక్షాసక్తిగలిగి దైవ ధ్యానముతో భజన మందిరముల సృష్టించి నిత్యమూ భజనచేయుచు సత్రముల చావిళ్ల కట్టించి దేవాలయములను బాగుపరచి పారాయణములు చేయుచు భూతదయా దాక్షిణ్యముగలిగి సత్పురుషులనిపించుకొను పుణ్యపురుషులు పుట్టుచుందురు.

శ్రీ:- స్వామి! శంఖుస్థాపనచేయువారి జాతకానుగుణ్యముగా స్థలము లభించునా లేక స్థలము మంచిదిగా చూచుకొనవచ్చున.

గు:- వత్సా! జాతకానుగుణ్యముగా స్థలము లభించును. చతుర్థబలమువల్ల స్థలము దొరుకును. భూములు, గృహోపకరణములు గృహములు-జీవనోపాదులగు వృత్తి ఉద్యోగ వ్యాపార గౌరవ ప్రతిష్టల సృష్టించును. బంధు మిత్ర బలము గలిగించును. చతుర్థ సప్తమ దశమములు గ్రామ నిర్మాణకర్తకు ముహూర్తమునకు ముఖ్యములని తెలుసుకొనుము, జాతకుని యోగమునుబట్టి స్థలము లభించునుగాని మంచిది కావలయునన్న దొరుకదు. ఇది నిశ్చయము.

శ్రీ:- స్వామి! కొన్ని గ్రామములు పూర్వమున్న స్థానములు విడచి మరొక దిశన కట్టుచుందురు. కారణమేమందురు?

గు:- శ్రీవత్సా! గ్రామ స్థానమగు పంచమములో పాపగ్రహమున్నవారు నిర్మాణము చేసిన గ్రామ నివాసులు అన్య గ్రామములకు వెళ్ళిపోవుటయు, ఉత్తమ సంతతిలేక అప్రయోజకులు జన్మించుటయు,

గ్రామములోకక్షలు చెలరేగుటయు పంచమము స్త్రీగృహమైన వ్యభిచారులు కలహోత్సాహులుగా స్త్రీలుండుటయు, వంశ వృక్షములు వృద్ధిచెందక నశింపు చెందుటయు సంభవించును. అట్టి సమయములో స్థలము బాగ లేదని జోస్యుల నడిగి ఏ దిశకో ఒక దిశకు మార్చుకొనుచుందురు.

శ్రీ:- స్వామి! ఆ జోస్యులవారికి ఎక్కడెక్కడ శుభగ్రహము లుండవలయునో తెలిసి ముహూర్తముంచిన గదా ఆ గ్రామము అభివృద్ధి చెందును. తెలియనివారు ముహూర్తముంచిన తిరిగి అంతే గద.

గు:- ఔను, ప్రమాణ గ్రంధకారకులు వ్రాయనిది వీరేమి చేయగలరు అందరు ఆ గ్రంధముల పఠించినవారేగద. అందులో చంద్రుడు శుభుడుగా నుండకపోయిన మంచినీరు ఆ గ్రామములో నుండదు చంద్రుడు శుభుడైన లగ్నములు మీన, మేష, కటక, తుల, వృశ్చికములు ఈ లగ్నములలో లగ్నము కుదురవలయునుగదా అటుగాకున్న శుభ గ్రహ వీక్షణ చంద్రునిపై, కటకముపైనయినా వుండవలయును. లేదా కటకములో శుభ గ్రహములైనా వుండవలయును. ఒక లగ్నములో పాపియైన చంద్రుడు ముందయి శుభగ్రహము వెనుకై నుండిన కొంత వరకు మంచినీరుగా నుండును. లేదా పాపిగా చంద్రుడుండిన మంచినీరు దొరుకదు.

శ్రీ:- స్వామి! గ్రామమునకు శంఖుస్థాపన చేయుటకుముందు దేవాలయము నియమించవలయునా లేక గ్రామము నియమించవలయున

గు: వత్సా! గురుపాలిత జాతకుడైన వైష్ణవ సంప్రదాయ కముగా దేవాలయము గర్భగుడికట్టి ప్రతిష్ఠచేసి అర్చన చేయుటకు నియ మించి అటుపై గ్రామమును కట్టవలయును. దేవాలయమునకు ఈశాన్య

మూలలో అర్చకునకు బ్రాహ్మణులకు నియమించవలయును. శనిపాలిత జాతకుడైన దేవాలయమునకు పశ్చిమమున అర్చకులకు, బ్రాహ్మణులకు గృహములు కట్టవలయును. శివాలయమును. శివాలయమును నిర్మించ వలయును. దేవాలయములకు చుట్టు వెడల్పుగల వీధులుండవలయును. దేవాలయములకు ముందు ప్రహరి గోడలకు లోపలికి గృహములుండ రాదు. ఉండిన నశింపు కాగలవు. ముందు వెడల్పుగల వీధిని నియమించ వలయును. వీధి కెదురుగ గృహములుండరాదు కోనేరుగాని, బావిగాని వుండుట శ్రేయము. శివభక్తులకు శివాలయము విష్ణుభక్తులకు విష్ణు ఆలయము ప్రతి గ్రామమునకు వుండవలయును. గ్రామములో అనేక ఆలయముల సృష్టింపరాదు. అర్చక కుటుంబమునకు తక్కువలేని ఆదాయముండవలయును. బ్రహ్మ సరస్వతి దేవాలయముండిన విద్యా ర్థులకు ఎంతో మేలుగా నుండును. అప్పటికి త్రిమూర్తులు, త్రిశక్తు లున్న గ్రామమగును. ఆ గ్రామస్తులు త్రిదేవుల పూజించుటవల్ల దేహ శక్తి, జ్ఞాన శక్తి, ధన శక్తి ఈ త్రిశక్తుల ఆశీస్సులతో ధనము, విద్య, రూపము ఆ గ్రామస్తులకు లభించును. సర్వ సంపదలతో సుఖింతురు. ఈ మూడు శక్తులు ఒకచోట కలిసియుండుటరుదు. పండితులు, కవులు కలిసి బ్రహ్మగుడి లేకుండ చేయుటలో సరస్వతి ఆలయముల సూన్యము చేసినారు. ఇది కలికాల మహాత్మ్యము. ప్రతిగ్రామములో త్రిమూర్తులు త్రిశక్తులు వుండవలయును. దీనితో ఆ గ్రామము బాగుపడును. సర స్వతీ దేవాలయముండిన సంగీత సాహిత్యములు రెండు ప్రబలముగా నుండును. విద్యార్థులకు గ్రాహిత జ్ఞాపక శక్తులు సమయస్ఫూర్తి జ్ఞానము నొసంగి పండిత వర్గమున ఉన్నతస్థితి నొందునట్లుచేయును. జగద్విఖ్యాతి నార్జించువారిని పుట్టించును. అన్య దైవములవల్ల కవితాజ్ఞానము కలుగ వచ్చునుగాని సరళ కవిత్వము లభించదు. సంగీతజ్ఞాన ముండదు. చదు వరులకు తలనొప్పిగా నుండును. గాన ప్రతి గ్రామమున సంగీత కళా

కారులు. సరస్వతీ మందిరమైన కట్టి నిత్యము భజనచేయుచు వచ్చిన రాబోవు జన్మకు త్యాగరాయలవలె సంగీత సాహిత్య మలవడి జగద్వి ఖ్యాతిని గడింతురు. ఆ కవిత ప్రజల కుపకరించును. వత్సా! ప్రతి గ్రామములో దేవాలయముగాని, భజన మందిరముగాని బ్రహ్మ సరస్వతు లుండవలయును. విష్ణు దేవాలయములో లక్ష్మి, శివాలయములో పార్వతి వున్నదిగాని బ్రహ్మ సరస్వతిగల దేవాలయము లేదు. ముఖ్యముగా వుండతగినదానిని పౌరాణికులు నాశనము చేసినారు. అందువల్ల జ్ఞానము నశింపయి అజ్ఞాన మలముకొనుచున్నది. దైవశక్తి నశింపగు చున్నది, ప్రతి గ్రామమున వీరిని ప్రతిష్ఠించుట శ్రేయోదాయకము.

శ్రీ:- స్వామి! ధనాశాపరులు లక్ష్మీనారాయణుల దేహబలము శత్రు సంహారము, శాంబరీ మహిమలు కావలయునని పార్వతీ పరమే శ్వరుల కొలుచుచున్నారుగాని జ్ఞానము, బ్రహ్మజ్ఞానము కావలయునను వారు అరుదౌటకు కారణ మేమందురు?

గు:- వత్సా! జ్ఞానము, పుణ్యము సంపాదించును. మంచిచెడ్డల వివరించి చెప్పును. వినయ విధేయతల నలబరచును. రాబోవు జన్మ మంచిదిగా సృష్టించుకొనవలయునను తలంపు నిచ్చును. ధర్మకార్యముల చేయించును. పెద్ద చిన్నలలో గమనించితిరుగు శక్తిని గలిగించును. పాండిత్య బలమిచ్చి భుక్తికి నిచ్చును. ధ్యానశక్తితో, ముక్తికి త్రోవ నేర్పరచును. ఇట్టివి అనంతముగా సృష్టించును గనుక జ్ఞానశక్తియున్న కలియుగము నడువదు కాబట్టి వీరి పాటయే మరుపు వచ్చునట్లు చేసిరి. జ్ఞానమునకు ఎదురుగా నున్నది అజ్ఞానము - అజ్ఞానముతో అన్యాయము పెరిగి దొంగతనములు, దోపిడీలు, ఖూనీలు, అన్యమతములు, అన్యస్త్రీ అపహరణలు, దురాదాయములు మొదలగు సప్త వ్యసనములతో పాడై

పోవు కాలము కలియుగము కాబట్టి జ్ఞానాధిష్టాన దేవతలగు బ్రాహ్మీ బ్రాహ్మల తలంపే లేకుండ చేసినారు. ఇది యుగధర్మము. అజ్ఞానాంధ కారము ఆవరించుకొనుచున్నది. ఇదిగాక చంద్రుడు మనోకారకుడని మాతృ స్వరూపుడని అనేక విషయములకు, అనేక పదార్థములకు అధిపతి యనియు తెలిసి ప్రపంచము పుట్టినప్పుడే చంద్రుడున్నాడని తెలిసి అత్రి మునికుమారుడు చంద్రుడని గురుపత్నీదోషము మెడగట్టి చంద్రధ్యానము చేయకుండా చేసిరి. నిర్జరులకు గురువైన బృహస్పతిని ముసలివానిగాచేసి గురుశాపదగ్ధునిగా చేసిరి. చంద్రుని ద్రోహిగాచేసి నమస్కరింపకుండా చేసిరి. ఇక్కడ జ్ఞానమునకు చోటివ్వకపోయిరి. చంద్రమండలమున లక్ష్మి సరస్వతి బ్రహ్మ వున్నారని జోస్యము చెప్పుచున్నది. దీనిని గమనించినవారు లేరు. అందువల్ల జ్ఞాన శూన్యమైపోవలసి వచ్చినది. అజ్ఞానముతో సప్త వ్యసనములు చెలరేగవలసి వచ్చినదిగాన బ్రాహ్మీ బ్రహ్మ దేవాలయముల మరచిపోవునట్లు యుగధర్మము చేసినదని తెలుసుకొనుము.

శ్రీ:- స్వామి! ఎక్కడా సూర్య దేవాలయములు కల్పింపలేదే కారణ మేమందురు?

గు:- వత్సా! పౌరాణిక జోస్యులు సూర్యుని, శనిని, కుజుని రాహు, కేతువుల క్రూరులుగా నైసర్గిక పాపులుగా భావించి వెల్లడిచేయుట వల్ల సూర్య దేవాలయముల ధర్మాత్ము లెవ్వరు కట్టించ లేదు. సూర్య చంద్ర, కుజుల అనుగ్రహము లేక ప్రభుత్వ రంగమున కాలుపెట్టలేరని జోస్యులు చాటివుండిన ధర్మాత్ములు ఎవరో వకరు ప్రతిష్ఠచేసివుందురు. శాస్త్రము నశింపై, అశాస్త్రియమైన పౌరాణిక జోస్యము ప్రబలుటవల్ల సర్వము నాశనమైనది. త్రికోణములలో త్రిదేవతలు త్రికేంద్రములలో

త్రిమూర్తులున్నారని గ్రహించక లగ్నములు ఆరు, విష్ణుపాలన ఆరు, శివుని పాలన అని ఏ గ్రంధకర్త వ్రాయకపోవుటచేత జోస్యము దెబ్బ తిన్నది. ఇది యుగధర్మము. జోస్యము అంజన ఓషధీ ప్రభావము. మంత్రాంగములు ప్రాణముతో నుండిన కలియుగము నడువదని, మరుగైనవని తలంచుము.

ఆ॥ పూర్వపుణ్యముననుపుట్టొందు సౌఖ్యముల్
పాపఫలమువల్ల పతనమగును
పాపపుణ్యఫలము ప్రజలను పుట్టించి
కష్టసుఖములిచ్చు గనుము వత్సా!

ముందు జన్మలో పాపపుణ్యములున్నవని తలంచి చేతనైనంతవరకు పుణ్యకార్యములు చేయుచు పుణ్య కార్యములకు సహాయము చేయుచు దైవమును నమ్మి పూజించుచు, చేతనైనంతవరకు పాపమును అదుపులో పెట్టుకొన్నవారు ప్రకృత జన్మలో రూపవంతులై, ఆరోగ్యవంతులై, విద్యా ధనములుగలిగి సుఖించుచున్నారు. భార్యా పిల్లలకొరకై తన సుఖముకొరకై చెప్పరాని పాపములు చేసినవారు కురూపులై, నిర్ధనికులై నిరక్షరకుక్షులై, కాయకష్టముతో పరాభవములతో దాస్య జీవనులై చాలి చాలని ధనముతో దుఃఖితులై జీవించుచున్నారు.

శ్రీ లక్ష్మీనృసింహ సూర్యనారాయణ
ఉమామహేశ్వర బ్రహ్మార్పణమస్తు.



శ్రీ రాఘవేంద్ర గురుభ్యోనమః



శ్రీ శారదా దేవతాభ్యోనమః       శ్రీ లక్ష్మీ నృసింహాయనమః

శ్రీ సూర్యనారాయణాయనమః

శ్లో॥ శివమ్ హరిమ్ విధాతారమ్ ‧ తత్పత్నీ స్తత్సుతాన్ గురూన్
నత్వా సమస్త ప్రీత్యూహశాంతయే మంగళాయచ.



# దేవాలయ వాస్తు





శ్రీ:- స్వామి! దేవాలయములలో శివకేశవ ప్రతిష్ఠలు చేయ వచ్చునా?

గు:- వత్సా! ఒక ప్రహరిలో శివకేశవ ప్రతిష్ఠలు చేయరాదు. వీరిరువురికి భేదము లేదుగాని పరివార దోషమున్నది. ఇరువురికి ఒకే పరివారముగాదు. ఈశ్వరుడు భూతనాయకుడు. కేశవుడు దేవనాయకుడు ఈ పరివారము కలిసి తిరుగువారు గాదు. సరిపోని పద్ధతులుగలవారు ఆహార విహార వ్యవహారములలో ఒకరి పొత్తు ఒకరికి కుదరదు. ఒకరి దొకరు మెచ్చరు గాన అట్లచేసిన ఆ దేవాలయము కొంతకాలమునకు నశింపగును. శివాలయములో విష్ణుపర్యాయమైన బొమ్మలుండవు. శివాలయములలో తులసీ బృందావనముకూడా వేయరు. విష్ణు ఆలయములో శివపర్యాయమైన విగ్రహముల చెక్కరు. పగటి బలము దేవగణమునకు, రాత్రి బలము భూతగణమునకు గలదు గాన పరివార దోషము, ద్వేషము గ్రహించి విభజించినారు. వారి ననుసరింపక శివాలయములలో రా ము లాలయముల, కన్యకాపరమేశ్వరీ ఆలయములో రామ ప్రతిష్ఠ చే యు

చున్నారు. ఇవి పరివార దోషమువల్ల కొంత కాలమునకు నశింపుకాగలవు ఈశ్వర పర్యాయములో విష్ణుపర్యాయ దేవాలయములుండరాదు. కొందరు శివ కేశవులొకటే కదా ఎందుకుండరాదని వాదింతురు. పరివారదోషము మాట మరచిపోయో, తెలియకో వాదించి కట్టి చెరుతురు. సవ్యాపసవ్య ముల వాదించువారు మెండుగా నుండు కాలము గాబట్టి యిట్టివి నిర్ణ యించుచుందురు.

శ్రీ:- స్వామి! శివుని దేవాలయములో కన్యకాపరమేశ్వరీ దేవాలయములో రామ భజన, బాలయోగి భజన, సాయిబాబా భజన, రామ సప్తాహము చేయుచుందురే మంచిదే నందురా?

గు:- వత్సా! తెలియనివారు తెలిసినట్లు వర్తించి మీదికి తెచ్చు కొనుచుందురు. ఇతరుల దింపి వారిని నాశనము చేయుచుందురు. ఇది పాపభూయిష్టము. శివాలయములో శివునే ధ్యానించుట శ్రేయోదాయకము పరమేశ్వరీ ఆలయములలో ఆ మహాతల్లినే ధ్యానించుట శ్రేయముగాని వేరొకరిని ధ్యానించుట తగనిపని. శాపగ్రస్తులగుట తప్పదు. విష్ణు ఆలయములలోకూడా ఇదే న్యాయము వర్తించును-విఘ్నేశ్వరాలయలో సుబ్రహ్మణ్యఆలయములో, వీరభద్ర ఆలయములో పరమేశ్వరీ ఆలయ ములో శివధ్యానము చేయవచ్చును. విష్ణు ధ్యానముచేయుట యెట్లుండు ననగా రామాచార్యులతో నమాజ్‌చేయించినట్లును, నీయింటి దగ్గర నన్ను పొగడడము నాయింటిదగ్గర నిన్ను పొగడడము ఏట్లుండునో అట్లుండును ఇరువురకు తలనొప్పి తప్పక వచ్చును. శాపగ్రస్తులై కడకు అనేకమగు చిక్కులకు లోనగుదురు.

శ్రీ:- సామి! గృహములో త్రిమూర్తుల త్రిదేవుల పూజించి భావ విభేదము లేక అతిథ్య మిచ్చినవారే ధన్యాత్ములన్నారే నిశ్చయమే నందురా?

గు: ఔను. దైవము మూడు భాగలుగా తానే నియమించు కున్నాడు. ధనశక్తి లక్ష్మీనారాయణులు జ్ఞానశక్తి సరస్వతీ బ్రహ్మలు దేహశక్తి పార్వతీపరమేశ్వరులుగా రూపొంది యున్నాడు. అందువల్ల ఎవరిని నీవు ధ్యానింతువో పూజింతువో ఆ శక్తియే నీకు లభించును. మూడు శక్తులు ఒకరియందు ప్రకాశింపజాలవు. మత కర్తలు ఒక రొకరినే తీసుకొని అది ఒక మతముగా నిర్మించి మానవుల అదృష్ట హీనులుగా తయారుచేసినారు. జ్యోతిశ్శాస్త్రము వేదాంగములగు షట్ శాస్త్రములలో కన్నువంటిది. ఈ శాస్త్రములో లగ్న, పంచమ, నవమ సానములు పార్వతి, సరస్వతి లక్ష్మి స్థానములుగా నున్నవి. లగ్నము లగ్నాధిపతి బలముగా నుండిన దేహసౌష్ఠవము, బలము గలుగుచున్నవి. పంచమము పంచమాధిపతిబలముగానుండిన విద్యాబలము గలుగుచున్నది. నవమము నవమాధిపతి బలముగా నుండిన ధనబలము గలుగుచున్నది. ఈ మూడు బలములు గలిగినవారు అరుదుగా నుండుటకు కారణము త్రిశక్తులయందు భావ విభేదము లేక ధ్యానించి పూజింప కుండుటయే కారణమని సూచించుచున్నది. ఒకరికి చరాస్తి వుండి స్థిరాస్తి లేకుండును ఒకరికి ధన బలముండి ఆహార విహార వ్యవహారములు సంసార సుఖము అకాలములై అధఃపతనమై పోవును. ఒకరికి ధన బలము విద్యాబల ముండి ఉద్యోగ బలముండదు. కారణమేమన బ్రహ్మను తలంచక నిర్మాణములు-శంకరుని తలంచక సంసార సుఖము, సకాల వివాహము సకాల ఆహార విహారములు విష్ణువును తలంచక ఉద్యోగబలము పాలనా శక్తి ప్రజానురాగము లభించవు. అందువల్ల ప్రతిమానవుడు త్రిమూర్తుల త్రిశక్తుల ఆరాధించవలసి నున్నది. ఇది వేదోక్తము. గృహములో ఆరాధించిన పరివార దోషముండదు. దేవాలయములలో నున్నది భూత పరివారమునకు, దేవ పరివారమునకు సరిపోదు. ఇది అందరికి తెలిసిన

విషయమే యగును. 1 దేహము, 4 బ్రహ్మస్థానము 5 విద్యాస్థానము 7 రుద్రస్థానము మైదున నిద్రాహారములు 9 లక్ష్మిస్థానము, ధనము, 10వృత్తిస్థానము. ఈ అరు స్థానములలో ఒక స్థానమైన శుభగ్రహము లేకుండిన వాడు జీవచ్ఛవముగా బ్రతుకవలసి వుండును. త్రిశక్తి స్వరూపమీ ప్రపంచముగాన భావ విభేదములేక మత ద్వేషము విడచి త్రిమూర్తుల, త్రిదేవుల నర్చించిన వారే ధన్యాత్ములు.

శ్రీః- స్వామి! దేవాలయములలో నవగ్రహ ప్రతిష్ఠలు చేయవచ్చునా? నవగ్రహ ప్రదక్షిణలు దేవుడుండగా వీరికి చేయవచ్చునా? దైవము కామితార్థములు తీర్చునని ప్రదక్షిణ నమస్కారములు చేసి అర్చన చేయించుచున్నారు. అట్టి దేవాలయములో వీరిని వుంచవచ్చునా చక్కగా తెలుపుడు.

గుః- వత్సా! నవగ్రహములు ఎక్కడుండ వలయును. ఏ గ్రహమును ఏ దిశన కూర్చుండబెట్ట వలయును. దేవాలయములో ప్రతిష్టించవచ్చునా? ప్రాకారమునకు బైట వుండవలయునా అను సందేహమే లేక యెక్కడ చూచినా దేవాలయములలోనే ప్రతిష్ఠ చేసినారు. ఇది అప్రతిష్టగాని ప్రతిష్టగాదు. తూర్పున కధిపతి సూర్యుడు. అట్టి దిక్పతిని మధ్యలో నియమించి అగ్ని మూల కధిపతియైన శుక్రుని తూర్పున కూర్చుండబెట్టినారు. వాయువ్యమూల కధిపతియైన చంద్రుని అగ్నిమూలలో నిలిపినారు. కుజుడు, రాహువు, శని, వారివారి స్థానముల యందే వున్నారు. ఈశాన్య మూలలో వుంచవలసిన కేతువును వాయువ్య మూలన నిలబెట్టినారు. ఉత్తర దిశకు అధిపతియైన బుధుని ఈశాన్య మూలన వేసి ఈశాన్యమున కధిపతియైన గురువును ఉత్తరమున నిలిపినారు ఈ నవగ్రహ మండలమునకు ప్రదక్షిణ నమస్కారములు

చేసిన నిష్ఫలమగును. ప్రతిష్ఠ చేయించినవారికి ఫలము దుష్ఫలమగును వీరు చేసిన విధముగా జోస్యుడు దిశాఫలములలోగలుగు సత్ఫల దుష్ఫల ముల చెప్పిన పృచ్ఛకులు వప్పుకొనరు. జోస్యము పదభ్రష్ట మగును. వీటిని సంస్కరించుటకు మహనీయుడు కలికాలములో సూర్య భుక్తిలో పుట్టగలడని తెలియుచున్నది. గ్రహరూపి జనార్దన గ్రహరూపీ మహేశ్వర గ్రహరూపీ వారిజాసన అన్నది వున్నది. దేవునికి ప్రదక్షిణ నమస్కారములు చేయక నవగ్రహములకు తిరుగమని చెప్పుచున్నారు తిరుగుచున్నారు. దేవుడని పూజలు ప్రదక్షిణ నమస్కారములు చేయుచు దైవాంశతో జనించిన ఈ నవగ్రహములకు ప్రదక్షిణలుచేయుట శ్రేయ మగునా లేదా యను ఆలోచనచేయక దేవాలయములలో నవగ్రహముల నిలిపినారు. వృథా ఫలము. శాపగ్రస్తు లయ్యెదరు.

శ్రీ:- స్వామీ! అట్లయిన నవగ్రహములు యెచ్చటుండ వలయును. ఎట్లుండవలయునందురు?

గు:- వత్సా! దేవాలయములో నవగ్రహములకు మ్రొక్కుట ఎట్లున్నదనిన కలెక్టరును చూడబోయి బిల్లజవానుకు మొక్కినట్లున్నది తాను గ్రహరూపముగా నున్నను తనకే మ్రొక్కవలయునుగాని గ్రహ రూపీ జనార్దన అన్నంతమాత్రము దేవాలయములో వీరిని పూజించుట ధ్యానించుట తగదు. నవగ్రహములు దేవాలయ ప్రాకారమునకు వెలుపలుండవలయును. ఈ నవగ్రహములు మానవుని పాప పుణ్య ముల చోదితాస్త్రములవలె చేసినవి గ్రహించగల అస్త్రములు తనకు ఏ గ్రహబాధగలదో దానికి దానము ఏ గ్రహముతనకు మేలు చేయు చున్నదో ఆ గ్రహమునకు పూజ నైవేద్యములు చేయవలయును.

జోస్యునివల్ల ఈ విషయములు చక్కగా తెలుసుకొనవలయును. పాప గ్రహమునకు దానము శుభగ్రహమునకు పూజ చేయుట వేదోక్తము శుభస్కరము, అన్ని గ్రహముల గొంతెమ్మలవలె కూర్చుండబెట్టి పేడా బెల్లము పిసికినట్లు అందరికి తిరిగితే ఫలము నిష్ఫలము తప్పదు. ఉండ వలసిన విధానము పూర్వుల భావము ఇట్లుగాదు తెలిపెదను విను

ప్రతి గ్రహమునకు మండలము అందులో సమిధ విగ్రహము, యంత్రము, మంత్రము వుండవలయును. ప్రదక్షిణ నమస్కారములు చేయుటకు వసతి వుండవలయును.

## సూర్యుడు

సూర్యునకు తూర్పు దిశగాన తూర్పుదిశన మండలము వలయా కారముగా గల్పించి మధ్యలో సూర్య విగ్రహమును - విగ్రహమునకు ముందు సూర్య యంత్రము గుడిపై మంత్రము విగ్రహమునకు వెనుక ఆ మండలములోనే తెల్ల జిల్లేడు చెట్టును వేసినవైన్నసమిధతో అంగము లైదు సరిపోవును ఈ సూర్యునకు ప్రదక్షిణ నమస్కారములు చేసి పూజించి నైవేద్యమర్పించిన సూర్యమండలముచుట్టు తిరిగినవారగుదురు కుష్టు, బొల్లి, శూలలు మొదలగు రోగనివర్తియగుటయేగాక నిరుద్యోగు లగువారు నమ్మి సేవించిన ఉద్యోగ ప్రాప్తి తప్పక లభించును, కంటి జబ్బులు గలవారికికూడా నయమగును, సర్వ సౌఖ్యములు చేకూరును. ఆయురారోగ్య భాగ్యములు లభించును. పశ్చిమాభి ముఖముగా నుండ వలయును. ప్రతి ఆదివారము ప్రదక్షిణ నమస్కారములుచేసి యంత్రము పైన చక్కెరో, పంచో ద్రాక్షో పెట్టి నమస్కరించి తానింత కన్నులకద్దు కొని దైవభుక్తిశేషమని భావించి నోట వేసుకొని అక్కడున్నవారికింత

పెట్టి వచ్చుచుండిన సకలైశ్వర్యముల పొందును. రాబోవు జన్మకు సామ్రాజ్యాధీశుడగుట నిశ్చయము. జ్యోతిశ్శాస్త్రము నిజమని చాటు చున్నది.

శ్రీ:- స్వామి! వారములవలె వరుసగా నుండవలయునా లేక దిశల వారిగా నుండవలయునా తెలుపుడు.

గు:- వత్సా! నవగ్రహములు వారి వారి దిశలయందే వుండ వలయునేగాని వారములవలె గాదు.

## శుక్రుడు

సూర్యునికి ఎడమ భాగమున అనగా ఆగ్నేయమున శుక్రుడుండ వలయును. శుక్ర మండలము పంచ కోణములతో నున్నదని వేద ప్రమాణము హిందువులు బృహస్పతిని గురువుగా సూర్యుని సేవించు ముఖ్య దైవముగా వుంచుకొన్నారు. మహమ్మదీయులు దానికి విరుద్ధ ముగా ఎదురుగా మతము సృష్టించి మాకు మతగురువు శుక్రుడు సేవించు ముఖ్య దైవము చంద్రుడని నిరూపించుకొన్నారు. బాల్య చంద్రరేఖపై పంచకోణములతో శుక్రునుంచుకొన్నారు. మసీదులపై టోపీలపై నున్నవి చూడుము. అనగా శుక్ర మండలము పంచకోణములతోకట్టి మధ్యలో గుడి, గుడిలో శుక్రగ్రహమునుంచి విగ్రహమునకు ముందు శుక్ర యంత్రమును గుడిపైన మంత్రము గుడికివెనుక మేడిచెట్టు(సమిథ) ఏర్పరచిన శుక్ర గ్రహమునకు ప్రీతి గలుగును. ఈ శుక్రుని చుట్టు ప్రదక్షిణలుచేసి నమస్కరించిన శనిపాలిత లగ్నములవారికి సకలైశ్వర్య ముల నొసంగును. వివాహము కన్యకలకు సకాలములో చేయించును. పార్వతి అంశయే శుక్రుడుగాన పార్వతిని సేవించిన వారగుదురు.

రాబోవు జన్మకు సంగీత సాహిత్యములలో దక్షులుగాచేసి మైధున నిద్రా హారముల సకాలములో లభింపచేయును. ఇహసౌఖ్యములన్నీ ఈ గ్రహమునందే యున్నవి. వరబీజము, బుడ్డ, హర్నియా, వాహన గండములు, స్త్రీ గండము, పొత్తికడుపులోవచ్చు వ్యాధులు పోగొట్టును. కైలాస నివాసిని ప్రదక్షణము చేసినవారే అగుదురు. పాపగ్రహమైన దానము శుభగ్రహమైన పూజ చేయుట శుభస్కరము. వాయువ్య దిశాభిముఖముగా నుండవలయును.

## కుజుడు

దక్షిణ దిశాధిపతి కుజుడు. కుజమండలము త్రికోణము. త్రికోణ మండలములో మధ్యలోగుడి గుడిలో కుజగ్రహవిగ్రహము. విగ్రహము ముందు యంత్రము, గుడిపైన మంత్రము, గుడి వెనుక సమిథ (సంద్ర చెట్టు) వుండిన సంపూర్ణ కుజ మండల మేర్పడును. ప్రదక్షణ నమస్కారములు చేసినవారికి శత్రురోగ ఋణ విపత్తులు తొలగించును. చర్మ వ్యాధులు కుష్టు, బొల్లి, గజ్జి, గండమలలు మొదలగు వ్యాధి బాధలు తీరును. పాపగ్రహమైన దానము, శుభగ్రహమైన ప్రదక్షణ నమస్కార పూజలు యౌవన హీనులకు యౌవనము గలిగించును. విగ్రహము ఉత్తరాభిముఖముగా నుండవలయును.

## రాహువు

నైరుతి దిశాధిపతి రాహువు. రాహుమండలము సూర్పాకారము. (చాట) సూర్పాకారముగ మండలము గల్పించి దాని మధ్యలో గుడి. గుడిలో రాహు విగ్రహము. విగ్రహము ముందు యంత్రము, గుడిపై మంత్రము, వెనుక మబ్బు జువ్వి, దానిక్రింద గరిక వుండవలయును. ఈ గ్రహము ఏ స్థానములో నుండునో ఆ గ్రహ కారకత్వము ఫలము

నిచ్చును. శుభుడైన శుభఫలముల నిచ్చును. పాపిష్ఠుడైన ఆ కారకత్వ ములతో బాధించును. రాహు దశ శుభస్కారమైనదిగా నుండిన ప్రదక్షిణ నమస్కారములు నైవేద్యము, పాపిష్ఠుడైన దానము చేయవలయును. సర్పగండమున్నవారికి గండము తప్పించును. ఈశాన్యమునకు ముఖ ముండవలయును.

## శని

పశ్చిమ దిశాధిపతి శని. శని మండలము ధనురాకారముగా నిర్మించి అందులో మధ్యన గుడి. గుడిలో శని విగ్రహము. విగ్రహము ముందు యంత్రము, గుడిపై మంత్రము, వెనుక భాగమున ఆమండలము నందే జమ్మి చెట్టు (సమిధ) వుండవలయును. ఈ మండల ప్రదక్షిణ నమస్కారములుచేసి నైవేద్య మిచ్చిన కైలాసవాసుని ప్రదక్షిణచేసి నట్లగును. మూడునాళ్ల వరుస, నాలుగునాళ్ల వరుస. కామిలా, కుష్టు మొదలగు వ్యాధుల నిర్మూలించును. భుక్తిని, ముక్తిని, శక్తిని ప్రసా దించును. శత్రు రోగ ఋణవిపత్తుల నిర్మూలించును. ఈ ప్రదక్షిణ కైలాసమునకొక ప్రదక్షిణ చేసినట్లే యగును. మానవుల విపత్తుల మాన్పి సుఖశాంతుల నొసంగును. ఈ మండలములోనే జమ్మి చెట్టుకు వామ భాగమున మేడి చెట్టును వేసిన పార్వతీ పరమేశ్వర రూపమగును ఈ మండలము చుట్టూ ప్రదక్షిణ నమస్కారములుచేసిన కైలాసమున కొక చుట్టు తిరిగిన వారగుదురు. సర్వరోగములు పటాపంచలగును. రాబోవు జన్మకు సర్వాంగసౌష్టవముగలిగి మేరమీరిన మైథున నిద్రా హారములు గలిగి భుక్తికి, శక్తికి కొదువలేని వాడగును. దీర్ఘాయువు గలుగును. జీవితాంతము యౌవనవంతుడై శత్రు రోగ ఋణవిపత్తులకు లొంగక సకలైశ్వర్యములతో జీవింప గలుగును. తూర్పు ముఖముగా

ప్రతిష్ఠింపవలయును. ఈ మండలమునకు ప్రదక్షిణ నమస్కారములు చేసిన ఈశ్వరునికి చేసినట్లగును. కైలాసమున నొక స్థానమున్నట్లే తప్పదు.

## చంద్రుడు

వాయువ్య మూల కధిపతి చంద్రుడు. ఈ మండలము సమ చతుష్కోణము. ఈ కోణము మధ్యలో గుడి, గుడిముందు యంత్రము గుడిపైన మంత్రము, గుడివెనుక మోదుగచెట్టు, గుడిలో చంద్ర విగ్రహ ముండిన ఈ మండలమునకు ప్రదక్షిణ నమస్కారములుచేసి, నైవేద్య మర్పించిన విజ్ఞానశక్తి ప్రసాదించును. సకలైశ్వర్యములు నొసంగును. విద్యార్థులకు జ్ఞానశక్తి, జ్ఞాపకశక్తి సమయస్ఫూర్తి జ్ఞానశక్తి నిచ్చును. ప్రభుశక్తి గల్పించును. దేహ దారుడ్యము, వీర్య బలము నొసంగును. ఈ చంద్ర మండలమునందు లక్ష్మి సరస్వతి బ్రహ్మ నివాసస్థలము. ఈ మండలము చుట్టు ప్రదక్షిణ నమస్కారములు చేసిన ధనము, విద్య, ఆత్మజ్ఞానము, బ్రహ్మ జ్ఞానము లభించును. పిచ్చిపట్టినవాళ్లు, క్షయ రోగులు, జ్ఞానబల మేలేని విద్యార్థులు, మెదడు జబ్బులు, స్థౌల్య వ్యాధి గ్రస్తులు, నిర్వీర్యులు, నిరుద్యోగులు,నిర్ధనికులు, బిడ్డలులేనివారు, శిరో బాధగలవారు, గర్భకోశ వ్యాధులు గలవారు, మంచి మార్కులు రావలె నను ఆశగల విద్యార్థులు ప్రదక్షణ నమస్కారములు చేసి నైవేద్య మర్పించిన సకలైశ్వర్యములు చేకూరును. పాపగ్రహమైన దానము శుభ గ్రహమైన పూజ, నైవేద్యము ముఖ్యము. ఆగ్నేయ దిశాభిముఖముగా నుండవలయును.

## బుధుడు

బుధ మండలము ఉత్తర దిశన దక్షిణాభిముఖముగా నుండవల యును. బాణాకారముగా మండలము నియమింపవలయును. మధ్యలో గుడి. గుడిలో బుధవిగ్రహము విగ్రహము ముందు యంత్రము, గుడిపై మంత్రము, వెనుక భాగమున అపామార్గము ( ఉత్తరేణి , మట్టి చెట్టు వుండవలయును, ఈ బుధుడు భూతనాయకుడుగాన భూత నివాసమైన మట్టి చెట్టు వుండవలయును. ఈ బుధ మండలముచుట్టూ ప్రదక్షిణ నమ స్కారములుచేసి నైవేద్యమర్పించిన పక్షగతవాయువులు నచ్చు వ్యాధులు. భూతభయముగల స్త్రీలు, పైత్య వ్యాధులు, మూత్రానిక్యము గలవారు, శత్రురోగ ఋణవిపత్తులు గలవారు, వ్యవహారముగలవారు ప్రదక్షిణ చేయుట క్షేమము. అనేక వ్యాధులను నివారించును.

## గురువు

ఈశాన్య మూలకధిపతి గురువు. గురుమండలము దీర్ఘచతుష్కో ణము. మండల మధ్యలో గుడి. గుడిలో గురు విగ్రహము విగ్రహము ముందు యంత్రము, గుడిపై మంత్రము, గుడి వెనుక రావిచెట్టు వుండ వలయును. ఈ మండలమునకు ప్రదక్షిణ నమస్కారములుచేసి నైవేద్య మర్పించిన సకలైశ్వర్యముల నొసంగును. గోత్రాలికైనను బిడ్డలు గలుగును. నిర్ధనికులకు జీవనోపాదుల గలిగించును. మహావిష్ణువునకు ప్రదక్షిణ నమస్కారములు చేసినవారగుదురు. ప్రతి గురువారము సేవించుచు నైవేద్య మర్పించుచు వచ్చిన ఏ మంత్రములేక శక్తి, భుక్తి ముక్తి నొసగి వైకుంఠమున నొక స్థానము గల్పించును. విజ్ఞాన శక్తి నొసంగును. అధికార గౌరవప్రతిష్ఠల చేకూర్చును. 108 గురువారములు

సేవించినవారికి సత్పుత్రులు కలుగుదురు. రాహోవు జన్మకు సకలైశ్వర్య ములతో సుఖింతురు. నైరుతీ దిశాభిముఖముగా నుండవలయును.

## కేతువు

ఈ గ్రహము ఈశాన్యమున గురుమండలమునకు వామ భాగ మున ధ్వజాకారముగా మండల ముండవలయును. కేతువు గురువునకు మిత్రుడుగాన తనపజ్జనస్థానమిచ్చి యున్నాడు. గురు మండలమునకు అనుకొనియుండవచ్చును. ధ్వజాకార మండలములో మధ్యన కేతుగ్రహ విగ్రహము ముందు యంత్రము, గుడిపైన మంత్రము వెనుక భాగమున దర్పులుండవలయును. అపసవ్యగ్రహమైనను తత్వకారకుడు మోక్ష కారకుడు తత్వవిద్య నొసంగి సర్వసంగపరిత్యాగమునిచ్చి మోక్షమునకు దారి చూపును. నైరుతీ దిశాభిముఖముగా నుండవలయును.

ఈ నవగ్రహ మండలములకు మధ్యలో లక్ష్మీనారాయణ విగ్ర హములు, వీరికి కుడిభాగమున గౌరీ శంకరుల విగ్రహములు, ఎడమన బ్రహ్మ సరస్వతీ విగ్రహము లుండవలయును. లక్ష్మీ నారాయణులకు ముందు గరుత్మంతుడును గౌరీశంకరులకు ఎదుట నంది, బ్రాహ్మీబ్రహ్మల ఎదుట హంస వుండవలయును. ప్రదక్షిణ నమస్కారములు చేయుటకు వీలుండవలయును. త్రిమూర్తులకు నాల్గు స్థంభముల మంటపము గలిగి వుండవలయును. మండపముపైన ఈ శ్లోకము రాతిలో చెక్కి వుంచ వలయును.

శ్లో॥ శివమ్ హరిమ్ విధాతారమ్ తత్పత్నీస్తత్సుతాన్ గురూన్
నత్వా సమస్త ప్రీత్యూహశాంతయే మంగళాయచ.

ఈ నవగ్రహ మండలముచుట్టు ప్రదక్షణాలు చేయుటకు స్థల ముండవలయును. త్రిమూర్తుల అంశతో జననమైన నవగ్రహములు త్రిమూర్తులు వుండుటవల్ల ఈ ప్రదక్షణములు ప్రపంచమున కొకచుట్టు తిరిగినట్లగును. ఆయా దిశలలో అష్టదిక్పతులున్నారు. వారిలో ముప్పది మూడుకోట్ల దేవతలున్నారు గాన దైవ సృష్టి అంతయు యిక్కడనే వున్నట్లగును. ఈ విధముగాచేసి పూజలు జరుగుటకు తగినంత ఆదాయము గలిగించినవారికి త్రిలోకములలో స్థానముండును. నమ్మి పూజించినవారికి త్రివిధశక్తులు లభించును. నిష్పాపులగుదురు. రాబోవు జన్మములో చక్రవర్తులై సర్వసౌఖ్యములనుభవింతురు.

జాతకమున్నవారుగాని ప్రశ్నలగ్నద్వారాగాని, శుభగ్రహ పాప గ్రహముల తెలుసుకొని పాపగ్రహములకు దానము, శుభగ్రహములకు ప్రదక్షణ నమస్కార పూజా నైవేద్యము చేయవలయును, ఏ పాప గ్రహమో ఆ గ్రహవారమున ఆ గ్రహమునకు ప్రీతికరమైన ధాన్యము ఆ యంత్రముపై విస్తరవేసి పావుకు తక్కువలేకుండ పోసి, తాంబూలము శక్తికొలది దక్షణపెట్టి గ్రహము ముందు దైవార్పితముగా పండ్లో బెల్లమో, చక్కెరో, ద్రాక్షో పెట్టి శని, శుక్ర, చంద్ర గ్రహములకు బేసిచుట్లు తిరిగి సమ సరిచుట్లు, గురు, కుజ, రవి, బుధ గ్రహములకు బేసిచుట్లు తిరిగి నమస్కరించి ఒక బ్రాహ్మణునకు యిచ్చినట్లైన ఆ గ్రహపీడ కొంతవరకు తొలగును. ఆ దైవభుక్త శేషమైనదని భావించి తానింత సేవించి అక్కడున్నవారికింత యిచ్చుట శ్రేయోదాయకము.

సూర్యునకు గోధుమలు, శుక్రునికి అనుములు లేక అలసందలు, కుజునకు కందిబేడలు, రాహూవుకు ఉద్దిబేడలు, శనికి నూగులు, చంద్రునికి బియ్యము, బుధునికి పెసలు, గురువుకు శనిగబేడలు, కేతువుకు ఉలవలు.

గ్రహపీడ బలముగా నున్నవారు నాలుగు వారములకొకసారి అనగా నెలకొకసారి ఏ గ్రహమునకు ఏ రంగు వస్త్రమో తెలుసుకొని అర్ధ మీటరు గుడ్డను యంత్రముపై పరచి ఆ ధాన్యము అర్ధ శేరు పోసి నైవేద్యము ఆ గ్రహము ముందుంచి ప్రదక్షిణ నమస్కారములు చేసి దానమొక బ్రాహ్మణుని కిచ్చుట శ్రేయము,

సూర్యునికి గోధుమ రంగు, శుక్రునికి ముతక తెలుపు, కుజునికి ఎరుపు, రాహుకు పొగరంగు, శనికి నలుపు, చంద్రునికి శుద్ధతెలుపు, బుధునికి ఆకుపచ్చ, గురువుకు పసుపు రంగు, కేతువునకు చీటి అన్ని రంగులు కలిసినది.

సూర్యునకు ఆదివారము, శుక్రునికి శుక్రవారము, కుజునికి మంగళవారము, శనికి శనివారము, చంద్రునికి సోమవారము, బుధునికి బుధవారము, గురునికి గురువారము శ్రేయోదాయకము. రాహువునకు శనివారము కేతువుకు గురువారము.

శ్రీ:- స్వామి! గురువు మహావిష్ణువు అంశ. శని ఈశ్వ రాంశ. వెంకటేశ్వరునికి శనివారము చేయుచున్నారు. శ్రావణ శని వారములని చేయుచున్నారు. శనివారమే వెంకటేశ్వరునికి ఒక్కపొద్దు లుంటున్నారు. శనివారమే పుట్టువెంట్రుకలు తీయించుచున్నారు. శని వారమునకు విష్ణువునకు సంబంధము మంచిదేనా? తెలుపుడు.

గు:- వత్సా! ఇది యెట్లున్నదంటే రామాచార్యులను పట్టక పోయి మసీదుదగ్గర నమాజు చదువమన్నట్లున్నది. సూర్యుని మొదలు కొని శనివరకు నవగ్రహముల పేర్లనే వారములకు పెట్టినారు. శని శివాంససంభూతుడు. గురువు విష్ణు అంశ, హరిహర రూపమున చావు

పుట్టుకల గల్పించి సకల జీవుల పోషించుచున్నారు. అది గమనించక కలియుగనాయకుడని కలిపురుషుని క్రింద జమచేసి శనివారమును గల్పించినారు. శనివారమునకు వెంకటేశ్వరునికి ఎలాటి సంబంధము లేదు. అజ్ఞానులు జ్ఞానులమని అపార్థముల గల్పించి నానా మతముల నానాభాషల, నానా కులముల, నానా ఆచారముల, గల్పించు మహా పురుషులు పుట్టునదే కలియుగమని వ్యాస మహర్షి చెప్పినాడని పెద్దవా రంటుంటారు. అట్లు వెంకటేశ్వరునికి శనివారము గల్పించినారు. విష్ణు పర్యాయముగా గురువారము ప్రీతికరము. శంకరునికి శనివారము ప్రీతి కరము. దానిని వదలి రుద్రాభిషేకములు మొదలుకొని పూజలు సోమ వారము చేయుచున్నారు. పార్వతికి ప్రీతికరమైన శుక్రవారమును లక్ష్మి వారమనుచున్నారు. పార్వతీ అంశతో జననమైనవాడు శుక్రుడుగాన శక్తికి ప్రీతికరము శుక్రవారము - సోమవారము లక్ష్మీవారము. సోమ వారము సరస్వతికి బ్రహ్మకు నెలవు - చంద్రునిలో లక్ష్మి సరస్వతి బ్రహ్మ వున్నారని జ్యోతిశ్శాస్త్రము చెప్పుచున్నది. త్రిమూర్తి స్వరూప మైన ఆదివారమును శక్తిపర్యాయముగా భావించి గ్రామ జాతరలు మొదలుకొని జంతుబలుల కుపయోగము చేయుచున్నారు. ఇట్టి వికృత ములు ఏనాడు పుట్టెనో కాలము తెలియకున్నది. విన్నన్న చెప్పినదే వేదమన్నట్టుగా ప్రజలు నడచుచున్నారు. సోమవారమునాడు చంద్రి మండల ప్రదక్షణచేసి నైవేద్య మర్పించిన లక్ష్మి సరస్వతి బ్రహ్మల నారాధించినవారగుదురు. చతుష్కోణముగా కట్టబడిన అరుగులో మోదుగ చెట్టును వేసి ప్రతిస్కూలు ముందు నియమించి విద్యార్థుల ప్రదక్షిణ నమస్కారములుచేసిస్కూలులో ప్రవేసించునట్లు చేసినవారికి జ్ఞానాభి వృద్ధియగును. సమయస్పూర్తి జ్ఞానము గలుగును. ప్రతి స్కూలుముందు ఈ వృక్షమునువేసి అడుగుకట్టుట శ్రేయోదాయకము. వృక్షములలో

దేవుడున్నాడా అని సందేహించువారు లేకపోలేదు. స్థావర జంగమము లలో దైవ సమానములు, దైవ నివాసములున్నవని మహర్షుల నిర్ణయము. మానవులకు అనుభవములోనున్నవి. చతుష్పాద జంతువులలో గోవు దైవ సమానమని కామధేవాంశయని పూజించు చున్నారు. వృక్షములలో దైవాంశ సంభూతములు గలవని రావి, మేడి, జమ్మి, జిల్లేడు వేప, మోదుగ, తులసి, దర్భ, మారేడు, (బిల్వము) మొదలగు స్థావరముల పూజించు చున్నారు. భూత నివాసములని మఱ్ఱి, జువ్వి మొబ్బ, జిల్లి, తాండ్ర యింకా ఎన్నో వృక్షముల భావించి గ్రామములో గృహముల సమీపములో వేయకున్నారు. ఓషధీరూపమునగాక అనేకవిధముల మానవులకేగాక జీవకోటి కుపకరించి పుణ్యమార్జించి మానవత్వము సంపాదించుచున్నవిగాన స్థావరములందు ప్రాణమున్నదవి భావించుట శ్రేయోదాయకము.

శ్రీ:- స్వామి! దేవాలయములలో ప్రత్యేకముగా అశ్వర్థ నారాయణ అని అరుగు కట్టి రావి వేప వృక్షముల పెంచి పెండ్లి చేయుచున్నారు. వాటి క్రిందనే నాగప్రతిష్ఠ చేయుచున్నారు. శాస్త్రసమ్మతమేనందురా! ఈ వేపచెట్టు రావి చెట్టు ప్రక్కన వుండవచ్చునా, శాస్త్రజ్ఞుల పొరపాటా తెలుపుడు.

గు - వత్సా. ఈ అశ్వర్థనారాయణ వృక్షముల ఏనాడు, ఎవ్వరు నియమించినారో ఫలానా కాలమని తెలియదు. ఇది పెద్దవారి పొరపాటేనని తెలియుచున్నది. అశ్వర్థ వృక్షము మహావిష్ణు స్వరూపమని (రావి) నారాయణి వృక్షము లక్ష్మియని రెంటిని పోషించి పెద్దచేసి అరుగుకట్టి వివాహముచేసి ప్రదక్షిణ నమస్కారములు చేసిన లక్ష్మి నారాయణుల సేవించినట్లేనని పెద్దవారు చెప్పుటవల్ల ఎల్లరు సేవించు

చున్నారు. వివాహము చేయుచున్నారు. ప్రజలు ప్రదక్షిణ నమస్కార ములు చేయుచున్నారు. లక్ష్మీనారాయణులుగా భావించుచున్నారు. ఇది పెద్ద పొరపాటు.

పార్వతికి నారాయణి అన్న పేరుగలదు. లక్ష్మికి గలదు. ఈ పేరు తెచ్చిన పొరపాటువల్ల పెద్దవారు లక్ష్మీవారము శుక్రవారమన్నట్లు వేపచెట్టును లక్ష్మీ వృక్షమని రావి చెట్టు ప్రక్కనచేర్చి అశ్వర్థనారాయ ణన్నారు. శక్తిపర్యాయముగా మల్లమ్మ, యల్లమ్మ, పోలేరమ్మ, సుంకులమ్మ మొదలగు శక్తుల వేపచెట్టులేక నిర్మించరు. అమ్మవారు పోసిన యింటిలో పంచితము చల్లుటకు వేప మండలనే వాడుచున్నారు. పెద్దమ్మను రైతులు చేయునపుడు వేపమండలతోనే గుడి కట్టుచున్నారు సుంకులమ్మకు చల్లాముద్ద పెట్టువారు వేపాకు మీదనే పెట్టుచున్నారు. వేపచెట్టును శక్తి స్వరూపిణిగా భావించి పూజించునున్నారు. పార్వతి నానా రూపములతో, దానా నామధేయములతో, నావా మంత్రషులతో లయకారిణియై వెలుగొందుచు పూజలందుకొనుచున్నది. పశునాశనీ అని పెద్దలచే పిలువబడుచున్నది. వేపాకు లేక బలిచల్లరు శాంబరీ విద్యకు మూలాధారము. మద్యమాంసాహారములు లేక శాంబరీవిద్య లభించదు. ఇట్టి వాటికి ఆధారభూతమైన వేపచెట్టును నారాయణి అన్నమాత్రిముతో మహావిష్ణు అంశతోనున్న రావిచెట్టు ప్రిక్క నుంచి వివాహము చేయుట పురాణోక్తమా, శాస్త్రోక్తమా, పురాణోక్తమై వృక్షముల వేసి పెంచి కట్టి నియమించిన వారికి, వాటికి వివాహము చేసిన వారికి పాపఫలమే గాని, పుణ్యఫలమూ లభించదు. ప్రిదక్షిణ నమస్కారములు చేసినవారికి ఫలము నిష్ఫలమౌట నిశ్చయము.

శ్రీ:- స్వామి! మరి యే చెట్టును వేయవలయునందురు. అయినా ఇది కలియుగము. శాస్త్రము పురాణోక్తమై పోయి ఫలించక

పోవుటచేత ప్రజలలో వుండ కూడదన్నారు. రోజాచెట్లను, దిశంబరు చెట్లను కస్తూరి తుమ్మను వేసుకొనుచున్నారు. వీటికి ముండ్లున్నవిగదా విన్నన్నచెప్పినదే వేదమన్నట్లున్నది. నమ్మకము చెడి నాస్తికులై పోవు కాలమన్నారు గదా. అందువల్ల ఇట్టి విపరీతము లనేకము పుట్టు చుండును. రావివృక్షము ప్రక్కన ఏ వృక్షముండవలయునో తెలుపుడు.

గు:- వత్సా! బిల్వఫలమును శ్రీఫలమని లక్ష్మి హోమము చేయవలయుననిన బిల్వఫలముల వాడుచున్నారు. ఫలము శ్రీఫలమయిన వృక్ష మేమగును. లక్ష్మిగాదా గమనించుము. ఈశ్వరునకు బిల్వార్చన చేయుటకు బిల్వపత్రములనేవాడు చున్నారు. వైద్యులు చలువయని ఓషదుల చేయుచున్నారు ఈ వృక్షమునకు ముండ్లు గలవని కంటకి అను నామధేయము గలదని తోసి పుచ్చినారు, సన్ననిమ్మకు ముండ్లు న్నవని గృహ ప్రాంగణములో వేయకూడదన్నారు. అశ్వర్థవృక్షము ప్రక్కన బిల్వ వృక్షమును వేసి ప్రతిష్ఠ చేసినవారికి సర్వ సౌఖ్యములు లభించుటయేగాక దానంతటది కైవల్యమెదురై వచ్చును. ఆదివారము ప్రదక్షణ నమస్కారములు, చక్కెరో, బెల్లమో ద్రాక్షో నైవేద్యము చేయువారికి ప్రభుత్వోద్యోగము, పాలనాశక్తి ఇచ్చుటయో లేక జీవనో పాదులకు తగినట్లు మరియొక వృత్తిని చూపుటయో తప్పదు - సోమ వారము ప్రదక్షణచేసినవారికి విద్యార్థులకు జ్ఞానాభివృద్ధి పెద్దవారికి సకల సంపదలు, బ్రహ్మజ్ఞానము సమయస్ఫూర్తి జ్ఞానము మోక్షవాంచ నిచ్చును. మంగళవారము సేవించినవారికి వసములు పంటభూమి సకాలవివాహము యౌవన బలమిచ్చి సర్వవిధముల పోషించును. గురువారము సేవించిన వారికి సుపుత్రుల నిచ్చును. గొడ్రాలయినను చింతదీర్చి బిడ్డల నిత్తురు నిర్ధనికుడు సేవించిన ఏదోవక వృత్తిని చూపించి నిర్ధనికత్వమును బాపును ధర్మబుద్ధి నిచ్చి నియమ నిష్టల నొసంగి ముక్తిమార్గమును చూపి గమ్య స్థానమును చేర్చును.

లక్ష్మీనారాయణ దేవాలయ ప్రదక్షణ నమస్కార ఫలమెంతో అంత ఫలమీ అశ్వర్థ నారాయణ వృక్షము లిచ్చును. ప్రకృతమున్న అశ్వర్థ నారాయణ కట్టలు వ్యర్థములు పాపభూయిష్టములు నిష్ఫలములు.

శ్రీ:- స్వామి అశ్వర్థ నారాయణ కట్టలపై నాగప్రతిష్ఠలు చేయుచున్నారే ఇది పురాణోక్తమా శాస్త్రోక్తమో తెలుపుడు.

గు:- వత్సా నాగులకు అధిపతి రాహువు. రావి చెట్టుకు అధిపతి మహావిష్ణువు. వీరిద్దరు ఒకచోట కలిసిన గురు చండాలయోగ మం దురు. ఫలము నిష్ఫలము. గురుచండాలయోగమన్న శాస్త్రజ్ఞులు గమనించలేదు. ఈ నాగులు ఈశ్వరునికి ప్రియమైనవి- ఈశ్వరాంశతో జనించినవి. నాగుల జమ్మిచెట్టు క్రింద ప్రతిష్ఠచేసిన సత్ఫలము గలదు. ప్రదక్షణ నమస్కారములు చేసినవారికి శుభములు చేకూరును.

ధనురాకారముగల అరుగులో జమ్మిమేడి ప్రతిష్ఠ చేసినచోటు నాగప్రతిష్ఠ చేసిన మహత్తరమైన శక్తి గలుగును. ప్రజలు ప్రదక్షణ నమస్కారములు చేసిన సత్ఫలము లభించును. కోర్కెలు పండును. అశ్వర్థ వృక్షము క్రింద నాగప్రతిష్ఠ చేయుట శాస్త్ర విరుద్ధము. ఒకే వేపచెట్టు క్రింద చేయుటకూడ శ్రేయోదాయకమేయగును. నవగ్రహములు, అశ్వర్థనారాయణ వృక్షములు, నాగులు దేవాలయములలో నుండ రాదు. ప్రహరికి వెలుపలనే వుండుట శ్రేయోదాయకము-

శ్రీ:- స్వామి దేవాలయము సమచతుష్కోణముగా నుండ వలయునా లేక దీర్ఘ చతుష్కోణముగా నుండవలయునందురు,

గు;- వత్సా గృహములకు దేవాలయములకు కోటలకు భజన మందిరములకు దీర్ఘచతుష్కోణమే మేలు, గురుమండలము దీర్ఘ చతు

షోడణము గురువు. గృహముల కధిపతిగాన దీర్ఘచతుష్కోణమే వుండ వలయును. ఒకే కవాటము నియమించిన వచ్చిపోవు ప్రజలకు కష్ట ముగా నుండునని తలంచి కొన్ని దేవాలయములకు ఇరు ప్రక్కల కవా టములు గల్పించినారు. ఇట్లవుండరాదని కొందరు వుండవచ్చునని కొం దరు భావవిభేదములతో చెప్పుచున్నారు. గమనించి చూచిన మూడు వాకిండ్లు మూడు ప్రక్కల నుండుట శ్రేయోదాయకముగా గన్పడు చున్నది.

శ్రీ రామాంజనేయ వెంకటేశ్వర ధన్వంత దేవార్పణమస్తు.

## -[ మాతృ జ్యోతి ]-

( నవలా రాజము )

ఇయ్యది అమూల్య గ్రంధము 630 పేజీలు బైండుచేయబ[illegible] సంప్రదాయ విజ్ఞాన జ్యోతియనియు నవలారూపము ధరించిన [illegible] సర్వస్వమనియు, బహుశాస్త్ర మనియు ఇట్టి గ్రంధము 'నభూ[illegible] భవిష్యతి' యనియు పందొమ్మిదవ పురాణముగా పరిగణింప[illegible] ననియు పలువిధముల కవి పండితులచే పొగడదబడినది. [illegible] వరులకు వజ్రకవచము, యువతీ యువకులకు కామధేనువు, గృ[illegible] గృహస్థులకు ఉపాధ్యాయి బాలబాలికలకు సంగరక్ష. నిత్యనైమి[illegible] కర్మానుష్ఠానులకు చింతామణియని పాఠకులచే అనేక విధ[illegible] మెప్పొందినది. ప్రతి యింట నుండతగినది. వివాహ కాలముల[illegible] వధూవరులకు ఆశీర్వచనముతో యివ్వతగినది. వెల: రు. 15[illegible]

## [ జ్ఞాన జ్యోతి ]

విద్యార్థులకు కల్పవృక్షమువంటిది. నీతినియమములకు పెన్[illegible] వంటిది. 100 పేజీల గ్రంధ రాజము. వెల: రు. 2[illegible]

## [ గణేశ నారద సల్లాపము ]

ఇయ్యది సన్యాసి జన్మ వచ్చుటకు కారణముల తెల్పును. నియమములు ఎన్నిటనో విరజల్లును. సరళమై మృదు మధు[illegible] చదువరుల కింపుసొంపు నొసగు పద్య కావ్యము. వెల: రు. 2[illegible]

## ( శ్రీ శారదా గణేశ, వర ప్రసాద వధూవరులు )

ఇది ఒక ఏకాంక నాటిక - ఇందులో వధూవరులు మేనమ[illegible] మేనకోడలు - దుర్వ్యసనాలోలుడై సర్వత్రా చెడిన మామను స[illegible] పరచి వివాహమాడిన మేనకోడలి నీతి వాక్యములు ధర్మము లనేక[illegible] గలది. ఉన్నత విద్య నభ్యసించు విద్యార్థులు ముఖ్యముగా చ[illegible] తగినది. వెల: రు. 3[illegible]

## స్వప్నమాలా జ్యోతిస్సారము (తృతీయ తరంగవ[illegible]

ముహూర్త భాగము కాలామృతాది గ్రంధములలో నియమిం[illegible] ముహూర్తముల ఖండించి క్రమబద్ధమై శాస్త్రసమ్మతమైయుండు[illegible] వ్రాయబడినది. అనేక విషయముల తెలుపగలిగినది. వెల: రు. 7[illegible]

---


శ్రీ రాఘవేంద్ర జ్యోతిషాలయము

తాడిపత్రి తాలూకా. బొందలదిన్నె. అనంతపురం జిల్లా